# శ్రీ వేమన మాహాత్మ్యము

(5 అంకముల నాటకము)

గ్రంథకర్త:
లంకిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి

కాపీరైటు] 1954 [వెల అమూల్యము

ప్రథమ ముద్రణ
1000 ప్రతులు

మా అనుమతిలేనిదే యీ గ్రంథము అచ్చొత్తించుట గాని ప్రదర్శించుట గాని జరిగినయడల చర్య జరుపబడును. యిందు చక్కని శైలితో విడిగా వ్రాసిన అనుబంధములు గలవు. నాటకమునకు ముందుగా 1 వారము గడువులో మమ్ము కోరినవారికి కీర్తనలు ప్లైలును డైరక్షన్నును యివ్వబడును.

యీ పుస్తకము వలయు వారు నా అడ్రసుకు వ్రాసిన బడయగలరు.

ఇట్లు
లంకిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి

భారతీ ప్రెస్, తెనాలి
1954

# పీఠిక

యీ గ్రంథమును శ్రీ ఉమామహేశ్వరుల కృపాకటాక్షమున నేనువ్రాసి, శ్రీ మహాకవి రామానుజాచార్యులుగారిచే సవరణ గావింపబడి, గానకళా వాద్యనృత్తగీతకవిత, హాస్యకళానిధు లును, శ్రీ నృశింహ్వా ఉపాసన పీఠస్తులు నగు శ్రీ సరికొండ కోటిసూర్యప్రకాశరాజుగారిచే పరిశోధింపబడిన యీ నాటక రంగమును మా గ్రామస్తులు పండిత పామర జనసమక్షమున చదివి వినిపింపగా యిందు సారాంశమును గ్రహించి నాకు ఆనందము గొలిపి ప్రోత్సహించినందులకు నా ధన్యవాదము లర్పిస్తూ యీ ప్రక్క పుటయందు నుదహరింపబడిన ధన సహాయకులకు నా అభివందనములు.

ఇట్లు
లంకిరెడ్డి వెంకటసుబ్బారెడ్డి
వల్లభాపురం (పోష్టు)
తెనాలితాలూకా

5

శ్రీ

వేమన చరిత్రమను నాటక గ్రంథము అచ్చొత్తించ సహాయకులుగ వుండి విరాళా లొసంగిన వారి నామాంకితములు.

1. శ్రీ అగ్గు రామకృష్ణారెడ్డిగారు
2. శ్రీ లంకిరెడ్డి లక్ష్మారెడ్డిగారు
3. శ్రీ లంకిరెడ్డి స్వా॥ కు॥ వెంకటరెడ్డిగారు
4. శ్రీ లంకిరెడ్డి గుర్వారెడ్డిగారు
5. శ్రీ లంకిరెడ్డి స్వా॥ కు॥ సుబ్బారెడ్డిగారు
6. శ్రీ వంగా బ్రహ్మానందారెడ్డిగారు
7. శ్రీ వంగా వెంకటకృష్ణారెడ్డిగారు
8. శ్రీ బొమ్మారెడ్డి సూర్యనారాయణరెడ్డిగారు
9. శ్రీ లంకిరెడ్డి చినపాపిరెడ్డి గారు
10. శ్రీ వంగా మార్కండేయరెడ్డిగారు
11. శ్రీ లంకిరెడ్డి సు॥ కు॥ రామిరెడ్డిగారు
12. శ్రీ అగ్గు పి॥ కు॥ అంజిరెడ్డిగారు
13. శ్రీ జంగా పెదసాంబిరెడ్డిగారు
14. శ్రీ జంగా శివారెడ్డిగారు
15. శ్రీ జంగా నారాయిణస్వామిరెడ్డిగారు
16. శ్రీ జంగా రామిరెడ్డిగారు
17. శ్రీ గుదేటి వీరారెడ్డిగారు
18. శ్రీ నేలవల్లి శివయ్యగారు
19. శ్రీ వంగా కో॥ కు॥ వెంకటేశ్వరరెడ్డిగారు
20. శ్రీ కూపం రామచంద్రారెడ్డిగారు
21. శ్రీ ఆరిగ వెంకటరెడ్డిగారు
22. శ్రీ వాకా నారాయణరెడ్డి, వెంకారెడ్డిగార్లు

(తెనాలి యిత్తడి వద్దగిరా కొట్టువారు)

23. శ్రీ అగ్తు గోపిరెడ్డి, కంకణాల సుబ్బారావు
24. శ్రీ అగ్తు నా॥ కు॥ వెంకటేశ్వరరెడ్డిగారు
25. శ్రీ వింతా కోటిరెడ్డిగారు
26. శ్రీ వంగా పిచ్చిరెడ్డి కుమారుడు క్రిష్ణారెడ్డిగారు
27. శ్రీ మోదుగుల సుబ్బారెడ్డిగారు
28. శ్రీ ఆళ్ళ కొండారెడ్డి కుమారుడు వెంకటసుబ్బారెడ్డిగారు
29. శ్రీ అగ్తు రా॥ కు॥ వెంకటరెడ్డిగారు
30. శ్రీ జంగా చినసాంబిరెడ్డిగారు

---

# ఈ నాటకమున వచ్చు పాత్రలు

| | |
|---|---|
| సూత్రధారి | |
| అనవేమన : | కొండవీటి ప్రభువు |
| వేమన : | కథానాయకుడు |
| మంత్రి | |
| సేవకుడు | |
| అభిరామయ్య : | కంసాలి |
| శతావధాని | పురోహితులు |
| వెంకావధాని | పురోహితులు |
| విశ్వనాధుడు | కథానాయకుని మిత్రులు |
| మోహనుడు | కథానాయకుని మిత్రులు |
| నలుగురు : | ప్రజలు |
| వెంకన్న : | కల్లు దుకాణదారుడు |
| యిద్దరు : | త్రాగుబోతులు |
| నలుగురు : | కూలి ప్రజలు |

## స్త్రీలు

| | |
|---|---|
| నటి | |
| సూరమాంబ : | అనవేమన భార్య |
| అన్నపూర్ణ : | అనవేమన – వేమనల – సోదరి |
| దాసి | |
| ప్రభావతి : | వేశ్యకాంత |
| పార్వతమ్మ : | అభిరామయ్య భార్య |
| చంద్రి | |

యింకను సమయానుకూలముగా వత్తురు.

ఓం

పరబ్రహ్మణే నమః

# శ్రీ వేమన మాహాత్మ్యము

అను

## నాటకము

ప్రథమాంకము

నాంది

శ్రీయును భారతీసతియు జంతిత సంపదఖండభోగ దీ
ర్ఘాయువు లిచ్చి బ్రోవుత నయమ్మున నాకృతాకృతింపగ
జేయుగుణాఢ్య సజ్జనశ్రేష్ఠితఁ గాంచి నట్టి వా
శ్వాయత కీర్తిశాలిని సభాసదులన్ గనువారి నెల్లరన్.

సూత్రధారి:- (ప్రవేశించి సభను నలువైపుల దిలకించి ఆనందముతో) అహా! నేఁడుగదా సుదినము; రెడ్డిరాట్కులపవిత్రుడు వేమన మహాయోగి జీవిత మాహాత్మ్య మను నాటక ప్రదర్శనమునకు, వేడుకతో వేంచేసిన యీ ప్రేక్షకులను దిలకించిన ఎంతయో ఆనందము కలుగజేయుచున్నది గదా! (తెరవైపుకు చూచి) సఖీ యిలా రమ్ము.

నటి:- (ప్రవేశించి సభను దిలకించి) నాథా! విద్వజ్జనంబులతో గూడిన యీ సభావిశేష మేమి?

సూత్రధారి:- విశేషమే గలదు. సఖీ! - లోకమునం దెంతయో ఖ్యాతి గాంచిన మహాయోగియైన వేమన మాహాత్మ్య మను నాటకమును ప్రదర్శకులచే ప్రదర్శనము జరిగింపబోవ, అట్టి ప్రదర్శనమును గాంచుటకు వేంచేసిన సభ. యికనైనను తెలిసినదా?

నటి:- అట్టి వేమనయోగి మాహాత్మ్య ప్రదర్శనమనిన నే డెంతయో సుదినము గదా నాధా! యీ మహాయోగి మాహాత్మ్యమును వెలువరించినవారి నామాంకితము యిందు గలదా? నాధా!

సూత్రధారి:- గ్రంథకర్తగారి నామాంకితము లేనిదే గ్రంథము వెలువడదు. చెప్పెదను వినుము. పెదకాకానియందు వెలసియున్న శ్రీ గంగా, భ్రమరాంబ, మల్లేశ్వరస్వామి వార్ల నామములతో వ్రాసిన గంగా వివాహము, శివలీల, సాంబశివస్తోత్రము, గౌరి పార్వతి కళ్యాణము అను గ్రంథములను వ్రాసిన వారే యీ గ్రంథమును రచించినది. కాన అట్టి మహనీయుని సదా యెల్లప్పుడు గౌరవించుకుంటూ కాలము గడపుదము. ప్రేయసీ! ప్రేక్షకులు నాటకప్రదర్శనమునకు ఎదురు జూచుచు తొందరపడు చున్నారు. (తెరవంక జూచి) అదుగో పాత్రధారులు వచ్చు చున్నారు మనము వెళ్ళుదము రమ్ము.

నటి:- అటులనే వెళ్లుదము నాధా!

(అని యిరువురు నిష్క్రమింతురు. అవనిక జారును)

---

(అవనిక నెత్తగా : అంతఃపురభాగము)

(అనవేమన, సూరమాంబ, వేమన, అన్నపూర్ణ, మంత్రి, దాసీలు ఉందురు)

అనవేమన:- (విచారముతో) హా తండ్రీ! నీవు జీవించియున్న, నాకీ విచారము లేకుకదా.

గీ. సకల సామ్రాజ్య లక్ష్మిని సంతసమున
మంత్రి సామంత నృపవీరమణులు గొలువ
ధరణి బాలించి తుదకును, దైవగతిని
దుఃఖవారాశి మమ్ముఁ బాసి తరలినావ.

తండ్రీ, యీ కుటుంబ విషయములన్నియు నాకిడి, పరలోక సౌఖ్య మనుభవించు చుంటివా!

మంత్రి:- సార్వభౌమ! ఏల యీ విచారము. మనము మాత్రము శాశ్వతమా! -

ఉ॥ ఎందఱు భూపతు ల్పుడమినేలిరి యేలగనున్నవార లిం
కెందఱు గల్గనుండిరో! మఱెందఱు పుట్టిరొ గిట్టువార లిం
కెందఱొ వారలెల్లరకు నీయది శాశ్వతమౌనె నెత్తిపై
నం దగిలించుకో జనగ నాయకుడెవ్వనికేని శక్యమా.

ప్రభూ, రాబోవు భవిష్యత్కాలమును గురించి విచార పడవలయునే కాని, జరిగినదానికి విచారించనేల!

అనవేమన:- సచివరా! యీ సోదర సోదరీమణులు చిన్నవారలగుటచే నాకీవిచారను -

సూరమాంబ:- నాథా! అట్టి సందేహము మీ మనంబున వలదు. ఏలయన, మనకు సంతోసము లేదుగదా! వీరినే ప్రేమగా జూచుచు పుత్రప్రేమచే ముద్దుముచ్చటలు జరుపుకొనుచు సదా వీరి మంచిచెడ్డలనుజూచు భాగ్యము నాకు లభించినది గనుక

గీ. సీత సావిత్రి దమయంతి చెలువ లట్లు
సతము మీ పాదసేవయే సలిపికొనుచు
చంటిబిడ్డల నేవేళ సాఁకికొనుచు
ఘనతరానందకీర్తిని గాంతు జగతి.

అనవేమన:- దేవీ, అట్లే యొనర్తుము. యీ పాపలను నీటముంచి
నను, పాలముంచినను, నీదె భారము సుమా !
సూరమాంబ:- నాధా ! శుభముహూర్తంబున ఉపాధ్యాయులను
బిలిపించి వీరికి అక్షరాభ్యాసము చేయింతము.
అనవేమన:- ఆలాగే సఖీ ! (మంత్రివంక జూచి) మంత్రీ దర్బారునకు
వేళయయినది. వెళ్లుదము రమ్ము.
(అని యిరువురు నిష్క్రమింతురు)
(అవనికనెత్తగా రాజదర్బారు కాన్పించును.)
(అనవేమన, మంత్రి, సామంత, భటవర్గము లుందురు)
అనవేమన:- మంత్రిపుంగవా !
శ్రీయుతులై సదాప్రజలు సేమముతోడుత నున్నవారె ల
క్ష్మీయుతు భక్తిపీడక సుసీలతనుందురె సత్యమెప్పుడున్
బాయక యుందురే తమకు భక్తి కరంబిడువారె క్రిందు భూ
నాయకు లెల్ల మంత్రులు మనమ్ముల నీకు వదాన్యులే కదా.
మంత్రి:- ప్రభూ ! దేవరవారు రాజ్యము పాలింపుచుండ ప్రజలకే
కొరంతయును లేదు వినుడు.
సీ. తమ యశశ్చంద్రికల్ దశదిశల్ వ్యాపింప
బారజల్లిన శుభం భావుకుడవు
తండ్రి తాతలరీతి ధర్మవర్తనుడవై
ప్రజల పాలనసేయు పరమపురుష
తృటిలోన కరినుల త్రుంపించి ఘనకీర్తి
గాంచినయట్టి ఓ కార్యశూర
దయయు దాక్షిణ్యంబు తగుమాత్రమును జూపి
యశము నార్జించిన యార్యవర్య
గీ. కుతలమున ఖ్యాతిగాంచిన కొండవీటి
సీమ సింహాసనం బధిష్టించియుండ
యిక్కటులు జనుల కగు టదియెట్లు శత్రు
భయము తోషమంబు ప్రజలకు వచ్చుటెట్లు.

అనవేమన:- అమాత్యవర్యా ! నీవు వక్కాణించినది సమంజసమే. మంత్రి, సామంత, పురోహిత, భట, దండనాయకవర్గము లుండి తమకు నియమింపబడిన కార్యములను సత్ప్రవర్తనము కలిగి, సత్యశీలురై సదా నెరవేర్చినగదా మావంటి నృపులకు ప్రఖ్యాతి కల్గుట.

మంత్రి:- దేవరవారి చిత్తము.

అనవేమన:- సచివరా ! నీ కొక విషయము చెప్పుచున్నాను వినుము. రేపటినుండి మా చినవేమనకు మా చిరంజీవి అన్నపూర్ణకు విద్యాభ్యాసము చేయుటకు ఒక విద్యా గురువును ఏర్పరచి మన హజారములోనే విద్య నభ్యసించునట్లు ఏర్పాటుగావింపుము.

మంత్రి:- అలాగే ప్రభూ.

అనవేమన:- సచివరా ! నేటికి కొలువు చాలింతము.

మంత్రి:- చిత్తము.

అనవేమన:- భటవర్గకులార ! మీ పనులను మీరు నెరవేర్చుకొనుడు. మీరిక వెళ్ళిరండు.

(అందరు నిష్క్రమింతురు. అవనిక జారును)

(అవనిక నెత్తగా అంతఃపురభాగము. అనవేమన, సూరమాంబ, అన్నపూర్ణ, వేమన ఉందురు.)

అనవేమన:- (సోదర సోదరీలను యూరువులయందు కూర్చుండ బెట్టుకొని) బాబు - నీవును, మన చిట్టిన్నీ, మీరిద్దరును రేపటినుండి యిక్కడికే ఉపాధ్యాయులు వస్తారు. ఆయనవద్ద మీరు చదువు నేర్చుకొనండి. ఆయన చెప్పెడి అక్షరములను దిద్ది అప్పజెప్పుచు సంతోషముగా వుండండి బాబు.

వేమన:- అలాగే అన్నయ్యా.

అన్నపూర్ణ:- పెద్దన్నయ్యా ! నేను వెళ్తాను. పంతులుగారు ఎప్పుడు వస్తాడు. నేను బాగా చదువుకుంటాను. నాకు చాలా బొమ్మలున్నాయి. ఆ బొమ్మలతో ఆడుకుంటాను.

అనవేమన:- అలాగే తల్లీ, యింకా నీకు మంచిమంచి రబ్బరు బొమ్మలు కొనియిచ్చెదను.

వేమన:- నాకూ [illegible] కొనిపెట్టవు అన్నయ్యా.

అనవేమన:- అలాగె బాబు. నీకు [illegible] అమ్మాయికి బొమ్మలు తెప్పిస్తాను. దేవీ! సదా వీరి మంచిచెడ్డలు భారము నీదె సుమా.

సూరమాంబ:- నాథా! మీకట్టి విచారము వలదు. ఏమంటిరేని సతతము వీరల కే కొరంతయు రాకుండ కాపాడి వీరల పెంచి, పెద్దవారినిగాజేసి వీరియందున నేను లోకంబున కీర్తి గడించెదను దేవా!

అనవేమన:- అబలా! నీ వాక్కులవలన నేనెంతయో సంతసించితిని.

మ. సరసీజేక్షణ నీదు పల్కులకు నే సంతోషముం జెందితిన్
అరయ న్నామదిఁగ్రాగు చింత యణగెన్ ఆనంద ముప్పొంగె త్వ
త్పరమానంద గుణాత్త దివ్య సుచరిత్రన్ భావియం దెల్లరున్
అరుదారన్ గొనియాడి మెచ్చెదరు కల్యాణీ! మనోనాయకీ.

సూరమాంబ:- నాథా! సంతోషము.

వేమన:- అమ్మా! మేము రేపటినుండి బడికి వెళ్ళి, చక్కగా గురువుగారు వల్లించు పాఠములను శ్రద్ధగా విని నేర్చుకొనెదము.

సూరమాంబ:- బాబూ! వేమన

చం. విద్యయె భూషణావళియు విద్యయె సంపద విద్యయే సదా
హృద్యము విద్యయే జనుల కిమ్మగు పెన్నిధి విద్యయే సుమా
సాద్యము సత్సభాస్థలుల సత్యము విద్యయె లేకయున్న వా
డద్యతనమ్మునం బరమునందున లగ్గు వహింపనేర్చునే.

వేమన:- అలాగే నేర్చుకొనెదను తల్లీ!

మంత్రి:- (ప్రవేశించి అనవేమనను గాంచి) ప్రభూ! మన పౌరులు చెల్లించవలసిన శిస్తులు చెల్లించిరి. యివిగో వారి కానుకలు (అని ధనమును యిచ్చును)

అనవేమన:- సచివరా! యీ ధనమును మన ధనాగారములో వేయుము. అందు జమకట్టుము.

మంత్రి:- చిత్తము.
సేవకుడు:- (ప్రవేశించి) ప్రభూ! నమస్కారము.
(అని నమస్కరించును)

అనవేమన:- (సేవకుని గాంచి) సేవకా! ఏమి విశేషము.
సేవకుడు:- పౌరులు కొందరు వచ్చి తమ దర్శనార్థమై ద్వారముకడ వేచియున్నారు. తమ యాజ్ఞ.
అనవేమన:- సత్వరము వారిని లోపలికి రానిమ్ము!
సేవకుడు:- చిత్తము. (అని నిష్క్రమించును)
పౌరులు:- (ప్రవేశించి) దండాలండి - దండాలు ప్రభూ!
అనవేమ:- పౌరులారా!

చ. సతతము మీరు సేమమున సాగుచునుండిరె బంధులెల్ల సౌ
ఖ్యత గనుచుండిరే యిటు లెకాయెకి నాదరి మీరు జేరు టే
కతమున సంభవించినది కర్జ మదేమిటొ తెల్పుడయ్య
ఆతతమతి సాయమున్ సలుప తప్పక యత్నము సేయబూనెదన్.

పౌరుడు:- అందరు క్షేమముగానే యున్నారము ప్రభూ!

సీ. ధనధాన్యరాసులన్ దగ లోటు లేనట్టి
వినుతిగాంచిన కొండవీటిసీమ
పసిడిబండించెడి బలుసైతులకు నెల్ల
పేరుగాంచిన కొండవీటిసీమ
పాడితో బెంపొందు పసుసంపదలకెల్ల
కోటమైనది కొండవీటిసీమ
ఆరామశాద్వలమ్మై ప్రకాశించుచు
వృద్ధిగాంచిన కొండవీటిసీమ

సీ. ఇటుల శోభాయమానమై యొసకమెసగు
రాజ్యలక్ష్మిని గైకొన్న రాజవరుని
పాలనముంగోన నున్న మా ప్రజకు నిపుడు
కల్గె క్షామంబు మము వేగ గావుమయ్య.

అనవేమన:– మీక్షేమములే మాక్షేమములు. కావున మీకు కావలసిన కార్యములను నెరవేర్చెదను. విశదపరచుడు.

రెండవపౌరుడు:– ప్రభూ! మాపల్లెలో మాపెద్దలనాటి నుండియు దైవభక్తి యేమియో దైవమును ఎట్లు పూజించు కోవాలో మాకు యిప్పటికి తెలియదు. సామి మాకు యే యీతిబాధలొచ్చినా వర్షాలులేక యే కరువుబాధలొచ్చినా యేమంత్రాలో యే తంత్రాలతోనో కాలము వెళ్ల బుచ్చటమేకాని దేవుని పూజించుకొని దేవుని భక్తితో భజనచేసి సంతోషంగా వుండటం కాని లేదండి. మాకు యిప్పుడు మాపల్లెలో ఒక గుడి కట్టించి, అందు దేవున్నిపెట్టి మమ్మానందింప జేయుదురని తమరిని వేడుకొనుచున్నారము సామి.

అనవేమన:– అట్లయిన సరియె. మీ ఉత్సాహమును నెరవేర్చెదను. మీరు మీ గృహంబులకేగి తగు ప్రయత్నములలో నుండుడు.

మూడవవాడు:– చిత్తం సామి. చిత్తం ఆలాగే వుంటాము.

(అని నిష్క్రమింతురు. అవనిక జారును)

(అవనిక నెత్తగా అంతఃపురభాగము)

(అనవేమన, సూరమాంబ, అన్నపూర్ణ, వేమన ఉందురు)

అనవేమన:– (వేమనను, అన్నపూర్ణను దగ్గరకుతీసి) బాబూ! మీ పంతులుగారు చెప్పిన పాఠములను మీరు యిద్దరును వినిపింపుడు. ఎవరు శ్రద్ధగా చదువుచున్నారో చూచెదను.

వేమన:– అన్నయ్యా, మా పంతులుగారు చెప్పిన పద్యమును చెప్పెదను, వినుము.

సీ. ధరణిలోపల నేను తల్లి గర్భమునుండి
పుట్టినప్పటినుండి పుణ్య మెరుగ
నేకాదశి వ్రతం బెన్నడుండగలేదు
తీర్థయాత్రలకైన తిరుగలేదు
పారమార్థికమైన పనులు సేయగలేదు
బిక్షమొక్కనికైన బెట్టలేదు

జ్ఞానవంతులకైన బూని మ్రొక్కగలేదు
ఇతర దానములైన నియ్యలేదు
తే. నళిన దళనేత్ర నిన్ను నే నమ్మినాడ
జేరి రక్షింపవే నన్ను శీఘ్రగతిని
శ్రీ మహాదేవ శ్రీరమా చిత్తచోర
ఆదినారాయణా నన్ను అరసి బ్రోవు.

అన్నయ్యా యీ పాఠములను చెప్పిరి.

అనవేమన:- బాబూ చాలా ఆనందమును కలిగించినదోయి యీ పద్యము — (అన్నపూర్ణనుగాంచి) అమ్మా ఏది నీ పద్యము నీవుకూడ చెప్పుము.

అన్నపూర్ణ:- పెద్దఅన్నయ్యా చదువు చున్నాను వినుము.

కం. శ్రీ భూనీళా హైమవ
తీ భారతులతుల శుభవతిగ నెన్నుచు స
త్సౌభాగ్యము నొసగగ
శోభావించెదరు ధర్మలోల కుమారీ.

కం. పెనిమిటి వలదని చెప్పిన
పనియెన్నడు జేయరాదు బావలకెదుటన్
గినపడగరాదు కోపము
మనమున నిడకొనక యెపుడు మసలు కుమారీ.

కం. జపములు గంగా యాత్రలు
దపములు, నోములును, దాన ధర్మంబులు [redacted]
పుణ్య పురాణము పతిభక్తికి
నుపమింపను సాటిరాక యుండు కుమారీ.

అనవేమన:- మీ మీ పద్యములు చాలా భక్తిరసముగా నున్నవి.

సూరమాంబ:- (భర్తనుగాంచి) నాధా! అమ్మాయికి పెండ్లి సంబంధాలు వచ్చుచున్నవిగదా. ఏదియో తగు సంబంధమును గాంచి ముచ్చటగా వివాహము గావించుదము.

అనవేమన:- దేవీ! ఆలాగె. నాకును సంతోషమె. మన పురోహితులను తగు సంబంధమును గాంచివచ్చుటకు పంపెదను. (మంత్రిని గాంచి) సచివరా, పురోహితులకు కబురు చేయుము. వారితో అమ్మాయి వివాహ విషయము మాట్లాడవలెను.

మంత్రి:- ఆలాగె ప్రభూ. (అని యీవలకువచ్చి పురోహితుల రాక గాంచి, వెనుకకు వచ్చి అనవేమనను గాంచి) ప్రభూ పురోహితుల వారు వారికివారె వచ్చుచున్నారు.

పురోహితులు:- (ప్రవేశించి) దేవరవారికి జయము! జయము!

అనవేమన:- పురోహితులారా! మీకొరకు కబురంపితిని. ఏమనిన - మీతో శుభస్య ఒకటి తెలుపనెంచితిని.

పురోహితుడు:- మావలన అగుకార్య మేమిటో ప్రభూ!

అనవేమన:- ఏదియన, మా సోదరి వివాహ విషయమై తగు సంబంధమును గాంచి, అందు మీకు యిష్టమైనయెడల ముహూర్తంబును గూడ నిశ్చయించుకొని రాగలందులకు మిమ్ములను పంపనెంచితిని. కావున మీరు శీఘ్రగతిని వెళ్ళి తగు సంబంధమును గాంచి రండు.

పురోహితుడు:- (సంతోషముతో) ప్రభూ, ఆలాగే వెళ్లెదము. శెలవు. (అని యీవలకు వచ్చి వెంకావధానులను గాంచి) వరే వెంకావధానులూ! మనకు పప్పుధప్పళాలు ద్రొరికేభోజులు వచ్చాయి రారా, మనకు మంచి సంభావన దొరుకుతుంది.

వెంకావధానులు:- నిజమేనండి.

(అనుచు నిష్క్రమింతురు. అవనిక జారును)

(అవనిక నెత్తగా అభిరామయ్య గృహము)

పార్వతమ్మ:- (భర్తను గాంచి) నాథా! ఎన్నాళ్లీ వుపవాసములు చేయుచు కాలము గడుపుదము. చంటిపిల్లలు ఎలా ఆకలికి ఆగలేక ఏడ్చిఏడ్చి పడివున్నారో గాంచుము. నాథా! గంజియైనను కాయుటకు యిన్ని నూకలుగూడ కరవయ్యెగదా. యే గృహంబున కెళ్లినను సోలెడు బియ్యము అప్పుకూడ యిచ్చినవారు లేరు నాథా!

మన కమసాలి వృత్తి లేకపోయినను మరి యే యితరవృత్తి నైనను కాలము గడపుదము నాథా.

అభిరామయ్య:- దేవి! ఎవరివృత్తి వారికే అలవడునన్నట్లు మన వృత్తి లేక యితరవృత్తి కాసించిన, మనకు కాలముగడచునా? అయిన నాకు ఒక విషయము జ్ఞప్తికివచ్చినది. యివాళ్ల రాజుగారి దర్శనమున కేగి ఆయనను సందర్శించి అంతఃపురాంగనలకు కావలసిన నగలపనులు ఏమైనా గలవేమో వెళ్ళి విచారించివచ్చెదను. దేవీ! యీ పూటకు ఎచ్చటనైనా నూకలు తెచ్చి గంజికాచి యీ పసిపాపలకు పోయుము. నేను వెళ్ళివచ్చెదను.

(అని నిష్క్రమించును, అవనిక జారును)

(అవనికనెత్తగా రాజదర్బారు)

(అనవేమన, మంత్రి, భటుడు ఉందురు)

అభిరామయ్య:- (ప్రవేశించి) ప్రభూ! నమస్కారములు.

అనవేమన:- (అభిరామయ్యను గాంచి) ఏదియో కష్టములోవుండి, యిట్లు దీనత్వముతో వచ్చిన నీ వెవరవు? నీకు నా వలన అగు ఉపకారము యెద్దియో విశదీకరింపుము. దానిని తప్పక నెరవేర్చెదను.

అభిరామయ్య:- దీనపోషకా! నేను విశ్వబ్రాహ్మణుడను. కొంత కాలమునుండి యీ నగరములోనే కుటుంబ సమేతముగా కాపురముంటూ యున్నాను. బంగారు వస్తువులను చేయువృత్తి. వజ్ర వైఢూర్యాది రత్నములతో భూషణాంబరములను నిపుణతతో చేయగలవాడను దేవా! ఈ వృత్తి లేక ఉదర పోషణము గడువక యిట్లు తమ దర్శనముకొరకు వచ్చితిని. తమకు యిట్టి వృత్తియందు పని కల్పించిన తమ హజారములోనే తమ అనుమతి ప్రకారం భూషణాంబరములను తయారుచేసి యిచ్చుచు కాలము గడుపనెంచి తమయొక్క దర్శనమునకు వచ్చితిని దేవా! నా నామధేయం అభిరామయ్య యని పిలిచెదరు ప్రభూ!

అనవేమన:- అటులయిన అభిరామయా! యిచ్చటనే యుండి, మాకు కావలసిన ప్రకారము వస్తువులను తయారుచేసి యిచ్చుచుండుము. నీవు తయారుచేయు వస్తువులకు తగినరీతిని గౌరవముగా చూచెదను.

అభిరామ:- ఆలాగే ప్రభూ! తమ యాజ్ఞప్రకారమే హజారములోనే దుకాణముపెట్టి నగలు చేసి యివ్వగలవాడను. నేను వెళ్ళి సామానులను తెచ్చుకొనెదను. శలవు.

అనవేమన:- ఆలాగే తెచ్చుకొనుము.

అభిరామయ్య:- (నిష్క్రమించును)

అనవేమన:- మంత్రీ! మనము వెళ్ళుదమా!

మంత్రి:- (చూచి) ప్రభూ! తమ దర్శనముకు పురోహితులు వచ్చుచున్నారు.

పురోహితులు:- (ప్రవేశించి) దేవరవారికి జయము జయము.

అనవేమన:- భూసురులారా ఆసీనులుకండు.

పురోహితులు (ఆసీనులగుదురు) ఆయుష్మాన్‌భవ —

అనవేమన:- పురోహితులారా! తమకు నియమించిన కార్యవిషయము సఫలత గావించుకొని వచ్చితిరా.

పురోహితులు:- (వారిలో) శతావధానులు - నీవేచెప్పరా.

శతావధానులు:- వెంకావధానులు ఒకరు చెప్పేదేమిటి. నీవద్దనున్న లగ్నపత్రిక చూపించి విషయమంతా చెప్పుము.

వెంకావధానులు:- (లగ్నపత్రికను తీసి అనవేమనకు యిచ్చి) ప్రభూ! మనఅమ్మాయికి మంచి సంబంధము దొరికినది. వరుడు చాలా మంచివాడు. విద్యావంతుడు. రూపసి.

చం. నిగనిగ మేనిచాయ నవనీరజ నేత్రము లింపుగుల్కఁ కెం
జిగిబిగిమోవి గల్గియు కుశేశయనాళ సమానబాహువుల్
వగదొలింకింప వీరజనవంద్యత బొల్చెడు సోగకాడు చూ
డగ మన కన్నెకుందగిన సుందరరూప కళావిలాసుడున్.

ప్రభు కుర్రవానిని గాంచి మేమెంతయు సంతసపడి అతని తల్లి దండ్రులకు యీ విషయ మెరింగించిన వారును సంతోషమును బొంది భూసురులను రావించి లగ్నపత్రిక వ్రాయించిరి. ప్రభూ! యిదిగో లగ్నపత్రికండి. (అని లగ్నపత్రికయిచ్చును.)

అనవేమః- (లగ్నపత్రికను చదివి పురోహితులనుగాంచి) భూసురులారా! మనముకూడ యిప్పటినుండియే తగు ప్రయత్నములను గావింతము. మంత్రి సామంత భటవర్గములారా! నేటికి కొలువు చాలింతమా.

మంత్రిః- అలాగే ప్రభూ! (అందరునిష్క్రమింతురు.)

శ్రీ వల్లుట్ల గోత్రోద్భవ లంకిరెడ్డి సకలారెడ్డి పౌత్ర కోటిరెడ్డి పుత్రు
[redacted] వెంకట సుబ్బారెడ్డిచే శ్రీ ఉమామహేశ్వరస్వామి వార్ల
కృపాకటాక్ష వీక్షణములచే వ్రాయబడిన
శ్రీ వేమన మాహాత్మ్య మను నాటకమునందలి
ప్రథమాంకము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

# శ్రీ వేమన మాహాత్మ్యము
అను
# నాటకము

---

## ద్వితీయాంకము

(అవనిక నెత్తగా)

వేమన:- (వీధి అరుగుపై ఒంటరిగా కూర్చొని తనలో) నేను విద్యా విధానములన్నియు సాంగోపాంగముగా, జదివితిని. కాని,

చ. చదివితి సర్వశాస్త్రముల సారమునెల్ల గ్రహించినాడ నా
చదువున మర్మమెల్ల కడుచక్కగ చెప్పగలాడ సామునన్
పదునుతనమ్మునేర్చితిని భవ్యుల మిత్రులగూడి మాడెదన్
ఎదకది యింపు గూర్చునని యెంచి ముదమ్మున నెల్లవేళలన్.

(చూచి) అరుగో మిత్రులు వచ్చుచున్నారు.

మోహనుడు:- } మిత్రమా! ఏమిటోయి యింత యాలస్యము
విశ్వనాథుడు:- } చేయుచున్నావు, మేమి వెళ్లుచున్నాము. మాకు వీధిలో పనివున్నది.

వేమన:- మిత్రులారా! నేనును మీకొరకు ఎదురు చూచుచు యీ అరుగుపై కూర్చుని యుంటిని. వెళ్లుదమా?

మోహనుడు:- అట్లనే వెళ్లుదము రండు.

వేమన:- మిత్రమా యివాళ్ల మనపట్టణపు చిత్రములను యేయే వీధిని యే విశేషములు గలవో వీక్షించుదమా!

విశ్వం:- మోహనా! అట్లయిన ముందు పెద్దవీధికి పోవుదము (అని అందరు కొంతదూరము నడచి) మిత్రమా వేమన! యిది మన పట్టణమందుగల పెద్దవీధి. అనగా సమస్తజనులకు కావలసిన వస్తు సామాగ్రులను విక్రయించు స్థలము.

వేమన:- మిత్రులారా! చాలా వేడుకగా నున్న దీ వీధి. వేరొక వీధికి దారితీయుడు; పోవుదము.

మిత్రులు:- } (అందరు బ్రాహ్మణవీధి ప్రవేశింతురు)
వేమన:- } మిత్రులారా! ఏమిటీ విశేషము. ప్రతిగృహంబున వేద పఠన శబ్దములు వినవచ్చుచున్నవి. యిందు నివసించు వారెవరు?

మోహనుడు:- మిత్రమా! యిందు బ్రాహ్మణులు గలరు. వేరు జాతి వారు యీ వీధిన లేరు. కనుక, యిది బ్రాహ్మణ వీధి. అందుచే పెద్దవారు నేర్చిన వేదవిద్యను పిన్నలు కూడ వల్లించుకొందురు. కాన, యిచ్చట సతతము వేదఘోష వినబడుచుండును.

వేమన:- మిత్రులారా! ఆహా! వీరి గృహపరిశుభ్రతలు, వీరు వర్ణించు పాఠములు, నాకెంతయో సంతోషము గలిగించినవి. సరే, యింకే మైన విశేషములు గలవేమో యింకొక వీధికి వెళ్లుదమా?

(అందరుకలిసి వారకాంతల వీధికి పోవుదురు)

విశ్వనాధుడు:- మిత్రమా వేమన! యిదియొక వీధి.

వేమన:- మిత్రులారా! ఆధ్వని, గానకళవలె నున్నది. (వినుట నభిన యించి) ఆహా! చాలా అందముగానున్న దీ గానము. మిత్రులారా! యీ వీధి ఆవలివైపువరకు పోవుదమురండు.

విశ్వం:- } అటులనే వెళ్లుదము.
మోహనుడు:- } (అని ముగ్గురును నడచుచుందురు)

వేమన:- (సంతోషముతో) మిత్రులారా! యీ వీధిని ప్రతిగృహము నందును, పలువాయిద్యములపై సంగీతము కోకిలారావమో యను నట్లు వినంబడుచున్నది.-యీ వీధిని నివసించువా రెవరై వుందురు?

విశ్వం:- మిత్రమా! యిది వారకాంతల వీధి.

వేమన:- అనగా.

విశ్వ:- వేశ్యారత్నము లుంటారు. అంటే డబ్బుకు ప్రతిజాతి పురుషు సికి మన్మథసామ్రాజ్యాపు ప్రేమజూపు స్త్రీలు యీ వీధిని ఎక్కు వగా వుందురు. అందుకుగాను యీ వీధికి వారకాంతల వీధి అని పేరు.

వేమనః- (ఆశ్చర్యానందముతో ఎదుట జూపుచు) మిత్రులారా! అటుజూడుడు.

ఆ యెలనాగజూడు మహాహా యదె ద్వారము చెంతనుండి క
న్దోయినిఁ గల్వపూవుల నదోవిధిఁ జిమ్ముచునుండె నాహయిన్
హాయిని గొల్పు పెన్వగల నట్టిటుజూపెను నెంత సోగ సో
కోయి! తదీయ సంస్థితికో హా! యిదెగా సుమసాంప్రమ
యెంచిచూడగన్.

మోహనుడుః- అదియా, మిత్రమా! గమనించితినోయి. యిచ్చట నుండు రహస్యము. అట్టివారలె యీ వీధినుండువారలు. అట్లు వీధి ద్వారముల చెంత నిలువబడి, యీ వీధిని వచ్చుచుపోవుచు వుండెడి పురుషులంగని, ఎన్నియో శృంగారచేష్టలు గావించి, వారలకు మోహంబు గలుగునట్లు జేసి, వారిని కనుసైగచే గృహంబులకు రావించుకొని సర్వసన్యాసులుగా చేయునట్టి వేశ్యావనితలలో ఒక యువతి ఆబిడ.

వేమనః- మోహనా! నేను అడిగిన ప్రశ్నకు హాస్యమా! యిది నీవని నట్లు వేశ్యజాతి విజ్ఞానము కలదిగాను వారల గృహంబులకు పోవు పురుషులు విజ్ఞానములేని వారనియు భావించుకొని యిట్లు పల్కితివా? యిప్పుడు యిదిగో చెప్పుచున్నాను వినుము. అటు లెన్నటికిని కాజాలరు కాజాలరు. (అనుచు నడుచుచుండును)

ప్రభావతిః- (ద్వారముచెంత నిలువబడి తనకు ఎదుట కొలది దూరమున వీధిని పోవుచున్న ముప్వురంగాంచి అందు వేమనకు కనుసైగజేసి లోపలికి పోవును. వేమన గ్రహించును. ముప్వురును ప్రభావతి గృహసమీపమునకు పోవుదురు.)

వేమనః- (మిత్రులనుగాంచి) మిత్రులారా యిదియే ఆ యువతి గృహము. మనము సమీపమునకు వచ్చుసరికి యీ యువతి మనలగాంచి లజ్జా విశేషములచే లోపలికరిగినది పాపము. యీమెయొక్క వేష భాషలకు మనమెంతయో అంతరాయము గలిగించితిమి. ఏలయన, మనబోంట్లు వారల కెందరకు జూపించు చుండెడిదో కదా యీమె

శృంగారచేష్టలు. కాని సౌదర్యవతి యనియె చెప్పవచ్చును. మిత్రులారా! మీరిచ్చట యీఅరుగుపై కొలదిసేపు ఆసీనులుకండు. నేను యీగృహంబులోని కరిగి యీ యువతితో సంభాషించి తొందరగా వచ్చెదను. మీరువుండురా.

విశ్వం:- } మిత్రమా నీకా అభిలాష వున్నయెడల వెళ్లిరమ్ము
మోహనుడు:- } యిచ్చటనే యుందుము త్వరగారానియెడల మేము వెళ్లెదము (అని వీధిఅరుగుపై ఆసీను లగుదురు.)

వేమన:- (లోపలికి ప్రవేశించును.)

ప్రభావతి:- (చిరునవ్వుతో) మోహనాకారా! యీ పీఠముపై నధిష్ఠింపుడు (అని కుర్చీని సర్దును.)

వేమన:- సఖీరత్నమా! కనుసైగచే నన్ను రావించిన విశేష మేమిటో ఎరుంగవచ్చునా?

ప్రభావతి:- (సంతోషానందముతో) రత్నపురుషా! కనుసైగచే తమరు వచ్చుటకు తమకున్న మమకారమే కారణము. లేకున్న నేను కనుసైగ చేసినంతమాత్రమున, మీరు రావడమనిన, ఎంతయో ఆశ్చర్యకరమైన విషయము. నేను కనుసైగచేసిన కారణము వినుము. తమకోటలో జరుగు దేవతావుత్సవమునకు మీ అన్నగారానతిచే మేళమునకువచ్చిన సమయమున మిమ్మును అచ్చట గాంచితిని. ఆ సమయమున మీపై నాకు మోహమంకురింప, మీతో సంభాషించుటకు వలనుపడక మీ దర్శనముకొరకు ఎదురు చూచుచు వేచియుంటిని. నేటి కిది శుభసమయము. వింటిరా!

వేమన:- నాయందు నీకు యింత మమకారమున్నయెడల, అట్టి కోరిక తప్పక నెరవేర్చెదను. అయిన మీవంటి వెలయాండ్రకు నా వక్కరియందు ప్రేమగలుగుట యెంతయో ఆశ్చర్యము. కాని నా వంటి పురుషులు యీ నగరమందున లేరా భోగవతీ!

ప్రభావతి:- మోహనాకారా! వుంటే వుండవచ్చును కాని, నాకు యవ్వన మంకురించి నప్పటినుండియు నా కిట్టి కోరిక జనించలేదు.

అట్లే అయినయెడల:-

సీ. కోటి రూకలనిచ్చి కొండ నిన్నెక్కింతు
మనసిచ్చి మాటాడుమనియె నొకడు
కాసులరాసులఁ గమలాక్షి నిన్నుంతు
ననుగూడ రమ్మంచు ననియె నొకడు
జలజాక్షి బంగారు సౌధంబుగట్టింతు
చనవునమాటాడు మనియె నొకడు
కనకాభిషేకంబు కావింతు దయతోడ
గనుదోయి నన్నేలు మనియె నొకడు

గీ. ఎందఱెందఱో యీ రీతి నెటులనైన
నన్నుఁగనయగ తమశాన తన్నుకొనుచు
వచ్చు భుజగులబోద్రోలి; స్వామివారి
జూడగానె మనమ్మున సయ్యాడె మిగుల.

వేమన:- మోహనాంగీ! నీ మనోభీష్టవాక్కులకు కేనెంతయు సంతసించితిని. నేటినుండియు, ప్రధమోపాధ్యాయినివి కాదు! కాదు! పొరపడుచుంటిని. నేటినుండియు, సర్వసౌఖ్యానందము లొనగూర్చు సరసభామినివి.

ప్రభావతి:- (లోపలికేగి ఫలహారములను తెచ్చి) మోహనాంగా యీ ఫలహారములను స్వీకరించి, నన్ను కృతార్థురాలినిగా జేయుడు- (అని బల్లపై వుంచును)

వేమన:- యోషామణీ, నీ మృదుమధురమైన, సంభాషణము యీ సత్కారము, నా కెంతయో ఆనందము కలిగించినవి.

చం. అచ్చెరువయ్యె నాకు తరళాయత పద్మవిశాలనేత్ర నీ
ముచ్చటలొల్కు పల్కులను ముగ్ధ మనోహర రూపసంపద
భ్యుచ్చయ మన్నిటిం దఱిమి నూర్జిత యుష్మదనూనసత్కృతుల్
వచ్చెని వింటిజోదు పరువమ్మును వమ్మొనరింతు జెల్లదే.

నారీమణీ యిప్పుడు గాదు యీ సత్కారము. వేరొకప్పుడు వచ్చెదను. యిప్పుడు తొందరపనులు గలవు. వెళ్ళివచ్చెదను.

ప్రభావతి:- మహాపురుషా, అట్లే, తమ అనుగ్రహాము.
వేమన:- (నిష్క్రమించును. అవనికజారును)

(అవనిక నెత్తగా వీధి అరుగుపై విశ్వం, మోహానులు కూర్చుని వుందురు)

వేమన:- (ప్రవేశించి ప్రకాశముగా) మిత్రులారా! మన గృహంబుల కరుగుదము రండు.

మోహానుడు:- (ఏకసక్కెముగా) మిత్రమా! వేమన యింత యాలస్య మొనర్చితివేల, ఆ ప్రభావతి నిన్ను కట్టివేసికొనెనా.

వేమన:- లేదోయి, మోహనా. అది వారకాంతలలోకెల్ల సుగుణవతి, చాలా నేర్పరి. యీసంభాషణ కేమిలే. త్వరగా రండు పోవుదము.

(అనుచు వేమన, వెంట మిత్రులు, నిష్క్రమింతురు)

(అవనిక జారును)

(అవనిక నెత్తగా అంతఃపురము, అనవేమన, సూరమాంబ, అన్నపూర్ణ, దాసీలు వుందురు)

అనవేమన:- దేవీ! మన చిరంజీవికి సంబంధము కుదిరినది. మన పురోహితులు లగ్నపత్రికకూడ వ్రాయించి తెచ్చిరి. సుముహూర్తము డాయ వచ్చినది. వివాహ పనులను చేయించుదము. నీవు గృహములో కావలసిన ఏర్పాటులను గావింపుము. మన చినబాబు ఎచ్చటికి వెళ్తాడో కాని అతని విషయములకైనా నాకు సహాయభూతుడుగా రాడు. భోజనమునకైనా వచ్చెనా ?

సూరమాంబ:- రాలేదు నాథా!

వేమన:- (ప్రవేశించును)

సూరమాంబ:- (వేమనను చూచి) బాబు ఎచ్చటికి వెళ్ళితివి. భోజనము వేళైన తెలియలేదా నాయనా!

వేమన:- షికారునకు వెళ్ళితిని అమ్మా,

సూరమాంబ:- సరే, వెళ్లి స్నానముచేసి భోజనమునకు రమ్మా.

అనవేమన:- (వేమననుగాంచి) బాబూ అమ్మాయి వివాహకార్యము

సమీపించినది. నీవుకూడ సేవకులచే తగుపనులను గావింపవల
యును. ఎచ్చటికి వెళ్లుటకు తీరికవుండదు.

వేమన:- సరియే అన్నయ్యా (అని నిష్క్రమించును.)

అభిరామయ్య:- (ప్రవేశించి) ప్రభూ! నమస్కారము (అని నమస్క
రించును.)

అనవేమన:- అభిరామయ్య ఏమి విశేషము.

అభిరామయ్య:- ప్రభూ! నేను చేయబోవు భూషణాంబరము లేవియో
శలవీయ ప్రార్థన.

అనవేమన:- అభిరామయ్యా మా సోదరి వివాహ ముహూర్తము
కూడ డాయవచ్చినది. గావున మా సోదరికి రత్నములతో నమర్చిన
గొలుసు, కడియములు, దిద్దులు, చేయును. యివి, త్వరగా
చేయవలె. వెళ్లి తయారుచేసి తీసుకొనిరమ్ము.

అభిరామయ్య:- చిత్తము ఆలాగే శలవు (అని నిష్క్రమించును.)

అనవేమన:- (మంత్రిని గాంచి) మంత్రి వేళయినది. భోజనమునకు
వెళ్ళుదమా!

మంత్రి:- చిత్తము. ఆలాగే వెళ్లుదము (అని నిష్క్రమింతురు)

(అవనిక జారును)

(అవనిక నెత్తగా, అభిరామయ్య గృహము)

వేమన:- (ప్రవేశించి అభిరామయ్యా గృహమును గాంచి) యిదియే
కాబోలు! అభిరామయ్యా గృహము. వున్నాడేమో పిలిచెద గాక.
(అని కేక వేయుచు) అభిరామయ్యా వున్నాడా?

పార్వతమ్మ:- (లోపలనుండి బయటికి వచ్చి వేమనను గాంచి) లేరండి!
మీరా! చినబాబుగారు! రండి లోపలికి రండి! వస్తారు.

వేమన:- అమ్మా! యెచ్చటికి వెళ్లెను. దుకాణమునకు రాలేదు.

పార్వతమ్మ:- బాబూ! ఎక్కడనో కొండదగ్గిర ఒక మహాయోగి
వున్నాడట. కొన్ని రోజులనుండి ఆయనకు పూవులు, పండ్లు
పట్టుకువెళ్లి ఆయనను పూజించి వస్తూవున్నారు. యివాళ్ళకూడా,

అచ్చటికే వెళ్ళియుండిరి. కూర్చోండి బాబూ! యిప్పుడే వస్తారు. వేళ్ళయినది.

వేమన:- అమ్మా! కొందరపనులు గలవు. యిచ్చటవుండుటకు తీరిక లేదు? వెళ్లివచ్చెదను (అని యీవలకు వచ్చి) ఓహో! యిదియా వీని విషయము. ఆ మునికడకు వెళ్లుటచేత కాబోలు. ప్రతిదినము వేళ్లకు దుకాణముకు రావడములేదు. ఆ మునీశ్వరుని మాహాత్మ్యము నేనుకూడా తెలుసుకొనుటకు యీామె ఎక్కడో కొండదగ్గిర అని చెప్పెను కాని, విస్పష్టముగా చెప్పలేదే కానిమ్ము. యిప్పుడు తెలియక పోయినా ముందైనా తెలియక పోవునా! తెలుసుకొననా? సరే యిప్పుడు కా దీవిషయము (అని యోజించి) నేను ప్రభావతికి, మరల వచ్చెదనని చెప్పివచ్చితిని. అంతఃపురమున కేగిన ఏవో పనులు గలుగును కావున యిదే సమయము (అని వీథిని నడచుచు) ప్రభావతి గృహమునకే ఏగెద గాక (పోబోవును)

విశ్వం:- (ప్రవేశించి) ఎచ్చటికి మిత్రమా? ఒంటరిగా యీ ప్రయాణము. ఓహో! పొరబడుచుంటిని. వేశ్యా గృహంబునకు కాబోలు! అటులయిన వెళ్లిరమ్ము. నేనుకూడా వెంటవచ్చిన నీ ప్రయత్నమునకు అంతరాయము కల్గునేమో.

వేమన:- ఏమిటోయి 'విశ్వం.' చాలా హేళనగా పల్కుచున్నావు. మీాతో ఆనాడు షికారుగా వచ్చినందులకా యిట్టి వాక్ధోరణి సరే, ఆనాడు మనము పౌరకాంతల వీధికి వెళ్ళినపుడు నేను ఆ ప్రభావతిని సంభావించితిననియు, మరల దాని గృహంబున కేగుచుంటి ననియు, తలంచి యిట్లు హేళన చేయుచుంటివా? అయిన ఎందులకు దాని గృహంబున కేగకూడదు. దాని సౌంద ర్యము, దాని విలాసము.

ఉ. ఆ యెలనాగ సోయగము నందము చందము నెన్న నేరికౌ
ఆ యపురూపి ఆ హొయలు అయమకే దగు అంతకన్న వే

రే యువతీలలామ కనుపింపదు ముజ్జగముల్ పరీక్షగా
న్నా్రయక జూచినన్ సరియె మోహనరూపి విలాససంపదల్.

అట్టిది యగుటచే వెళ్లుచుంటిని. లేక వెళ్ళితిని. లేక వెళ్తాను. యిదియే కదా విశేషము.

విశ్వం:- ఓహెూహెూ, ఏమి వర్ణనమయ్యా, అయిన అట్టివారలం గూర్చి నాకు తెలిసిన విషయము చెప్పెదను వినుము.

సీ. మోము సబ్బున గడిగి పొందైనపౌడరు
పోసేల బూసియు సోకుజేసికొనియు
ముసిముసి చిరునవ్వు మొలక లాస్యమువీాద
నాట్యంబుసేయ సన్నాహపరచి
వీధుల నడయాడు విట యువశ్రేష్ఠుల
చూపు తూపుల గుండె సోరియజేసి
ఎన్నియో శృంగార హేలాకలాపాల
భుజగుల భయపెట్టి, పొలుపువిాఱ

కులుకు మురిపాల నెంతయో చిలకరించి
వెలల నార్జింపుచుందురు వేశ్యలెల్ల
మానహీనతకుం జెడి మోసపోవ
వలదు మిత్రమ వారితోవలదు పొందు.

వేమన:- మిత్రమా! చాల్లేవోయి, యీ సంభాషణము. ఎందుకు మనకా విషయములు. యిదుగో మిత్రమా, నామాట వినుము. నీకొక సహాయము చేస్తాను, కాని ఇంతటినుండి ఆ ప్రభావతి విషయము కాని నా విషయము కాని ఎచ్చటనైనా ప్రచారము చేయబోకు. యివిగో యీ నూరు రూపాయలు తీసికొనుము. నీవు హాయిగా వాడుకొనుము (అని రూపాయిలు యిచ్చును)

విశ్వం:- మిత్రమా ! సంతోషము. నీవంటి మిత్రుడు నాయండ నుండ నిన్నును నీ విషయములను నేను ప్రచారము చేస్తానా ? దైవ సాక్షిగా అట్లెన్నటికి జేయను.

వేమన:- సరియే మిత్రమా ! తొందరపని వున్నది. నేను వెళ్లుచుంటిని.

విశ్వం:- నేనును, వెళ్లుచుంటిని. మిత్రమా!

(అని యిరువురు నిష్క్రమింతురు.)

శ్రీ వల్లుట్ల గోత్రోద్భవ లంకిరెడ్డి సకలారెడ్డి పౌత్ర కోటిరెడ్డి పుత్ర
వెంకటసుబ్బారెడ్డిచే శ్రీ ఉమామహేశ్వరస్వామి వార్ల
కృపాకటాక్ష వీక్షణములచే వ్రాయబడిన
శ్రీ వేమన మాహాత్మ్య మను నాటకమునందలి
ద్వితీయాంకము సమాప్తము.

---

# శ్రీ వేమన మాహాత్మ్యము

అను

# నాటకము

## తృతీయాంకము

(అవనిక నెత్తగా పుద్యానవనము.

వేమన, ప్రభావతి విహరించుచుందురు)

ప్రభావతి:- ప్రియవల్లభా! యీ వసంతముయొక్క శోభానందమును గాంచిన ఎంతయో సంతసము గల్గుచున్నది గదా! యిందలి పుష్ప జాతులను, రకరకములైన యీ లతలను, యీ లతలకు కల్గిన పుష్పములను గాంచిన భగవద్సృష్టి ఎంతయో వర్ణనాతీతము అని స్పష్ట మగుచున్నది. మోహనాంగా! అటు జూచుడు ఆ భృంగము. ఆ పుష్పముచెంతకు ఎట్లు ఝుంకారము చేయుచు పోవుచున్నదో! ఏమి విశేషము!

వేమన:- భోగవతీ విశేషము ఏమున్నది? తనకు తగిన పురుషుని ప్రేమించినప్పుడు నీవలెనే శృంగారరసము చిట్లిపడుచు మా బోంట్లను కనుసైగచే ఎట్లు రావించుకొంటివో, అట్లే ఆ పుష్పము గూడా నంతియే. అబలా! యిదియే అందు విశేషము.

ప్రభావతి:- భోగపురుషా! నే నడిగిన ప్రశ్నకు చమత్కారమైన సమాధాన మిచ్చితివి. ఎచ్చట నేర్చుకొంటివయ్యా యీ విద్య.

వేమన:- యోషామణీ! నీ పంచకువచ్చి, నీ యండజేరి నీతో సర్వ భోగము లందుచుండ, ఎచ్చటనో నేర్వవలయునా? నా విద్య యిచ్చటనే నేర్చితిని.

ప్రభావతి:- (సంతోషానందముతో) పురుషశ్రేష్ఠా! యివిగో యీ చూతవృక్షమునందున్న ఫలములను గాంచుడు. పండి, పక్వమై,

చూపరులు ఎవ్వరైనను తాము గ్రోలుదురా అను భావము స్ఫురింపుచున్నట్లు, ఎట్లుక్రిందకు శాఖలనుండివంగి, కనబడుచున్నవో వీక్షింపుడు. (అని ఫలములను కోసి) యివిగో యీ ఫలములను భుజింపుడు. (అని ఫలములను యిచ్చును)

వేమన:- మోహనాంగీ ! సతతము అపురూపువృక్షమున పూబంతుల బోలు, ఫలరసముల గ్రోలుచుండ మధ్య యిప్పుడు యీ ఫలములు రుచించునా ?

ప్రభావతి:- మహాపురుషా ! యీ శరీరావయవములను తమ బాహు స్పర్శ కౌగిటయందు జిక్కించి సదా సంతోషానంద మందుచున్న నాతో యీ చమత్కారవాక్యములు పలికి నన్ను మరింత మోహములో పడవేయుచుంటిరి గదా !

వేమన:- ప్రియసఖీ ! సతతము ఒకరినొకరు ప్రేమించుకొని ఆనంద సౌఖ్యములం దేలియాడుచున్న వారికి యివి అన్నియు ఎందులకు. చాలా ప్రొద్దుపోయినది. గృహమున కరుగుదమా ?

ప్రభావతి:- ఆలాగె వెళ్లుదము రండు. (అని యిరువురు నిష్క్రమింతురు)

(అవనిక జారును)

(అవనిక నెత్తగా ప్రభావతి గృహము. వేమన, ప్రభావతి వుందురు)

ప్రభావతి:- మోహనాకారా ! తమవంటివారిని గొప్పగా సత్కరించ లేకున్నను, నాకున్న మాత్రమున సత్కరించుచుంటిని. యీ ఫలాహారములను స్వీకరింపుడు. (అని ఫలహారముల పళ్లెరములను వేమన ముందు బల్లపై వుంచును)

వేమన:- (ఫలహారములను భుజించి) ప్రియభామిని ! నీ సత్కారము నాకెంతయో సంతోషము కలిగించినది.

గౌరి:- (లోపలినుండి) అమ్మాయి ! ఎవరే వారు ?

ప్రభావతి:- ఎవరు కాదులె, మన యువరాజుగారు.

గౌరి:- (సంతోషముతో ప్రవేశించి) చినబాబుగారు మీరా ! నేను ఎవరో అనుకున్నాను.

వేమన:- అవును నేనె. అవ్వా ! ఏం కావాలి ?

గౌరి:- (నవ్వుచు) ఆ ఏమిలేదు నాయనా! ఏదో పెద్దముండను, ఏదో జబ్బుచేసి యీ మధ్యనే అలవడితిని. ఏదో నల్లమందుపిచ్చ.
వేమన:- అయితే నల్లమందు కావలెనా? యిదిగో యీ రూపాయి పుచ్చుకొని తెప్పించుకో.
గౌరి:- (రూపాయి పుచ్చుకుని సంతోషముతో) శ్రీమంతులు బాబు మీవంటివారుంటే మావంటివారి కేమితక్కువ బాబు నేను వెళ్ళుచున్నాను. (అని నిష్క్రమించును)
ప్రభావతి:- మోహనాకారా! యిదిగో కస్తూరి మలరిన యీ తాంబూలమును సేవింపుము. (అని తాంబూల విడియమిచ్చును)
వేమన:- (తాంబూలవిడియము పుచ్చుకొని) ప్రభావతి మా సోదరి వివాహముహూర్తము డాయవచ్చినది. తొందరపనులు గలవు వెళ్ళివచ్చెద.
ప్రభావతి:- అటులయిన వెళ్ళిరండు.

(వేమన నిష్క్రమించును, అవనిక జారును)

(అవనిక నెత్తగా అంతఃపురము
అనవేమన, సూరమాంబ, అన్నపూర్ణ, దాసీయు వుందురు)

అనవేమన:- దేవీ! ముహూర్తము డాయవచ్చినది. గృహకార్యములు అయినవా?
సూరమాంబ:- దాసీలు చేయుచున్నారు నాధా! అమ్మాయికి వస్తువులు చేయించితిరా నాధా!
అనవేమన:- అభిరామయ్యకు చెప్పితిని. యింకను యివ్వలేదా?
అభిరామయ్య:- (వస్తువుల పెట్టెను పట్టుకొని ప్రవేశించి) ప్రభూ! అమ్మాయి వస్తువులు యివిగోనండి (అని ఒక్కొక్క వస్తువును తీసి చూపించును) యిది చంద్రహారము, యిది రత్నహారము, యివి కడియములు, యివి గాజులు (అని యిచ్చును)
అనవేమన:- (పుచ్చుకొని పరికించి) అభిరామయ్యా చాలా నిపుణత కలిగియున్నవి. అందముగానే యున్నవి.
అభిరామయ్య:- ప్రభూ! దుకాణములో పనులువున్నవి శలవు.

అనవేమన:- సరే అలాగె.

అభిరామయ్య:- (నిష్క్రమించును)

అనవేమన:- (అన్నపూర్ణను దగ్గరకు తీసికొని సంతోషముతో వస్త్రములను ధరింపజేసి భార్యను గాంచి) దేవీ! మన అమ్మాయికి యీ వస్త్రువులు చాలా అందముగావున్నవి (అన్నపూర్ణను బుజ్జగించి) అమ్మా! సోదరీ! ఎంత అదృష్టవంతురాలవమ్మా! నీకు మంచి సంబంధము దొరికినది.

చ. పొలతిరో నీకు పూర్వకృత పుణ్యవిశేషముచే లభించె ని
న్నలినగుణాఢ్యశోభ దభిమాన ధనాఢ్యుడు సత్యసీలు స
త్కులభవుడైన భర్త నవలోయజపత్ర విశాలనేత్ర సం
కలితము లేదు నీకు సిరి కల్మిని నర్మిలి భోగభాగ్యముల్.

అమ్మా! యిదిగో, నీ విద్యాగురువుకు బహుమతి నర్పించి, శెలవు తీసుకొని వారి యనుమతిపడసి రమ్మా. యిదిగో యీ బహుమతి పుచ్చుకొనుము. (అని వస్త్రాదులు తాంబూలము పళ్ళెరములో బెట్టి అన్నపూర్ణకు యిచ్చును. అన్నపూర్ణ నిష్క్రమించును) ప్రేయసీ! బాబు రాలేదా?

సూరమాంబ:- రాలేదు నాథా! ఎచ్చటికి వెళ్ళినాడో.

అన్నపూర్ణ:- (ప్రవేశించి) అమ్మా! చిన్నన్నయ్య వచ్చుచున్నాడు. (ఎదురేగి) చిన్నన్నయ్యా! ఎక్కడికి వెళ్ళితివి.

వేమన:- ఎక్కడికి వెళ్ళలేదు సోదరీ. వీధిలో ఒక స్నేహితుడు కనపడి ఆతని గృహంబునకు రమ్మని బలవంతపెట్టిన ఆతని గృహంబున కేగితిని. పెద్దన్నయ్య వున్నాడమ్మా.

అన్నపూర్ణ:- వున్నాడన్నయ్యా!

అనవేమన:- (వేమనను గాంచి) వేమా, నీకీ స్నేహితులు ఆ భోగము వాళ్లు ఎందుకురా! నీకీ పనులు. మొన్న ఎవరోవచ్చి నాతో యీ రహస్యము తెలియపరచిరి. మనకున్న వ్యవహారములకు యితర పనులకు సంబంధమా.

వేమన:- అవును అన్నయ్యా, నీవన్న విషయములు నిజమే. మీరు పెంచి, విద్యాబుద్ధులు నేర్పించి పెద్దవాడను జేసినందులకు మీరు నాకు తల్లి దండ్రులతో సమానులు. కాని నేను పెద్దవాడనైతిని, సకలవిద్యలను నేర్చితిని. కీర్తికాని, అపఖ్యాతిగాని, నా మంచి చెడ్డలు నాకు తెలియును. గనుక మీరు పెద్దవారలు మీరేమియు చెప్పవద్దు.

సూరమాంబ:- అదేమిటి నాయనా! అట్లా పల్కుచుంటివి. మేము చెప్పక యితరులు ఎవరైనావచ్చి చెప్పుదురా. యింతలో యింత కోపమా!

వేమన:- అమ్మా, నాకు కోపమా.

చ. చదివితి నెల్లశాస్త్రముల సారములం బరికించినాడ స
ముద్రమున సజ్జనావళుల బోధలనెల్ల గ్రహించినాడ నా
ముదితలవృత్త మెట్టిదని పోల్పగఁ బొల్పడ పాపవృత్తి నా
కదుకగజెల్లునే నిజము నారయరే బుధు లెన్నగా ధరన్.

సూరమాంబ:- యిట్టి విజ్ఞానములో నీవుండిన మీ అన్నగారికి తెలియక కించిత్తుపడిన ఎదురు మరల భాషించవచ్చునా? బాబు సేవకులు విన్న హేళనసేయరా!

అనవేమన:- సరే! నీవిలా బుజ్జగించడమున్ను, ఆయన అలా పల్కుటకున్నూ, సరిపోయినది. యీ గొడవ యిప్పుడెందుకులే. బాబు మన బంధువులవెంట అమ్మాయి వివాహమునకు వెళ్లవలె. మన పరివారమును సిద్ధపరచి నీవును ప్రయాణ సన్నాహములో నుండుము.

వేమన:- నేనును వచ్చిన సేవకులే యిచ్చట పారా వుంటారా? యిప్పటికి నేనురాను. మీరు వెళ్లిరండి. వేరొకప్పుడు అమ్మాయిని తీసుకురావటమునకు వెళ్లివస్తాను.

అనవేమన:- సరే. మన పరివారమును సిద్ధముచేయుము.

వేమన:- సరే ఆలాగే చేయుదును.

సూరమాంబ:- నాథా వంట తయారైనది. రండి.

అనవేమన:- వచ్చుచున్నాము. చినబాబు వెళ్లుదము రమ్ము.
(అని నిష్క్రమణ అవనిక జారును)

(అవనిక నెత్తగా ప్రభావతి గృహము
వేమన, ప్రభావతి, చంద్రముఖి వుందురు)

వేమన:- (ప్రభావతిని గాంచి, తాను తెప్పించిన పెట్టెలను వేరువేరుగా జూపుచు) భోగవతీ యీ పెట్టెనగలు, యీ పెట్టె పీతాంబరములు అసగా పట్టుచీరెలు, యీ పెట్టె ధనపుపెట్టె వీనిని గైకొనుము నీ మీాది ప్రేమచేతనే నీకు యివి లభించునవి.
ప్రభావతి:- మహాభాగా నీతో సర్వ సౌఖ్యానందము అనుభవించు చున్న దాననుగదా ! యివి నాకేల ?
చంద్రముఖి:- బావగారు నన్ను మరచిరి కాబోలు.
వేమన:- లేదు చంద్రముఖీ యిదిగో నీకును, యీ పట్టుచీరె యీ చంద్రహారము తీసికొనుము. (అని యిచ్చును)

చంద్రముఖి:- (సంతోషానందముతో పుచ్చుకొనును)

వేమన:- ప్రభావతీ నీ వివేకము నేను గ్రహించితిని. కాని, యిప్పుడు మా సోదరి వివాహము. యీ సమయమున మా అన్నగారు కోటలో సుంకు వుద్యోగు లందరికి బహుమతులను యిచ్చు చున్నాడు. పాపము నీవు నా ప్రియసఖివైయుండి, సర్వదా నాయందే నీ కాలమును వెళ్లబుచ్చదలచిన నేనెంతయో సంతసించి, యిప్పుడు వీనిని నీకు బహుమతిగా యిచ్చుచున్నాను తెలిసినదా ! నేను వెళ్లుచుంటిని. నాకు తొందరపనులు గలవు.
(అని నిష్క్రమించును)

(అవనికనెత్తగా అభిరామయ్య గృహము
అభిరామయ్య నిద్రనుండిలేచి కనులునలుపుకొనుచు)

యివ్వాళ్ల తెల్లవారవచ్చినది పెండ్లి హడావిడి పనులు మూాల ముగా రెండురోజులనుండి నిద్ర తక్కువగుటచేత యివాళ

మెలకువరాలేదు. ప్రతిదినము తెల్లవారుఝాముననే, లేచి, ఆ మునీశ్వరుని, దర్శనమునకు వెళ్లుచుంటిని. కానిమ్ము. రాజగారు వూళ్లో లేరుగదా రేపుగాని రారు. అయిన దుకాణములో యివాళ్ల రేపు పనులులేవు. అందుచే అలస్యముగానే వెళ్లెదను. (అని ప్రయాణ సన్నాహములో వుండును.)

వేమన:- (అభిరామయ్యను జూచి) ఓహో! యీయన ఆమె అన్నట్లు, ప్రయాణ ప్రయత్నములోనే వున్నాడు. సమయమిదే. యివ్వాళ్ల నాకును ఆ మునీశ్వరుని దర్శనము లభించునేమో నేను యిచ్చటనే వేచియుండి యీయన వెళ్లునప్పుడు రహస్యముగా -- నేనును వెంట నరిగెదగాక! (అని రహస్యముగావుండి అభిరామయ్య వెళ్లుట గాంచి)

గీ. అదిగో యఱచేత( బళ్ళెర మ్మమరబూని
పూజకునువలయు ద్రవ్యంబు లోజమీర
దీసికొనిపోవుచుండె నే దెసకు నేగు
నో గనుంగొనువాడ నే యూహతోడ.

(అని నిష్క్రమించును. అవనిక జారును)

(అవనిక నెత్తగా కొండప్రదేశము ఋష్యాశ్రమము, అందు శివరామయోగి తపస్సుచేయుచుండును. అభిరామయ్య ప్రవేశించి చేతనున్న పూజాద్రవ్యంబులను ముందువుంచి ఒక ప్రక్కగా నిలబడి వుండును).

శివరామయోగి:- (కనులు తెరచి అభిరామయ్యను గాంచి) భక్తవర్యా! వచ్చితివా! నీ విషయము నా యోగదృష్టివలన తెలుసుకొంటిని.

సీ. వినుము నీ కొక ధర్మవిధిని బోధింతును
దానిని దప్పక బూనవలయు
యెవ్వ రేమన్నను యే యవాంతరమైన
యాజ్ఞను దప్పక వేగిరమున
మరునాటి యుదయాన మనసు(చివచ్చిన
గురువాక్యమును జెప్పి గురుతు నిత్తు

బలువైన మంత్రంబు పఠనంబుసేయగా
విధుల దెల్పెద నీకు విశదముగను

గీ. ఇష్టసిద్ధులుగల్గు నా యిచ్చినట్టి
మంత్రమహిమంబు కతననో మహిత
భక్తి శీల యయ్యది గోప్యంబు హేలమీఱ
నెవ్వరికి జెప్పరాదు యోగేతరులకు.

యీ గడువుకాలమును తప్పించబోకుము. యిదియునుం గాక, యింకొక విషయము. నేను యీ జపదీక్ష బూని పదకొండు వత్సరంబులైనది. రేపటితో నా గడువు పూర్తియగుచున్నది. యిందు నా కొక నియమము గలదు. ఏమనిన, నా తపస్సు కాలము ఎప్పటికి పూర్తి యగునో ఆ సమయమునకు నావద్దనున్న విద్యను యితరుల కెవ్వరికైనను బోధించవలయును. అట్లు బోధింప కున్న నాకు ఫలములేదు. కావున యిందు నీవు కష్టపడితివి. నీకు ఒనగూర్చెదను. తప్పక రేపు ఉదయము పదకొండు గంటలకు నీ విచ్చట నుండుము. వుపదేశము యిచ్చెదను —

అభిరామయ్య:- స్వామీ! ఆలాగె వచ్చెదను శలవు.

శివరామయోగి:- వెళ్లి రమ్ము. (అభిరామయ్య నిష్క్రమించును)

వేమన:- (పొదచాటున వుండి తనలో) ఓహో! యిదియా వీని రహస్యము. ఎంతకాలము నుండి యీ మునీశ్వరునికి ఫల పుష్పాదులను తెచ్చియిచ్చి సేవ చేయుచున్నాడో. యీ మునీశ్వరుడు వీని భక్తికి మెచ్చి రేపు తప్పక రమ్ము. మంత్ర వుపదేశమును జేసెదను అని పల్కిన, అభిరామయ్య సరేయని సంతోషముతో గృహమున కరుగుచున్నాడు. ఆయన యీ ఫలితమును ఎట్లు పొందునో చూచెదను గాక! యితను మా యాజ్ఞలకు లోబడివుండి, నగలు చేయు వుద్యోగములో వుండెగదా! ఆ సమయమునకు ఏదో ఒక వస్తువును రిపేరునకు బంపినచో వీనికి అంతరాయము కలుగును గదా! యిప్పుడే మా అంతఃపురమున కేగిన మా వదినగారు

బంధువులు వివాహ వుత్సవమునుండి రాక యుందురా!
(యోజించి) వచ్చియే యుందురు. కావున నేను వెళ్లి మా వదిన గారిని ప్రార్థించిన యీ కార్యము సఫలత నొందును. యిప్పుడే వెళ్లెదను గాక! (అని నిష్క్రమించును. అవనిక జారును.)

(అవనిక నెత్తగా అంతఃపురభాగము సూరమాంబ, దాసి వుందురు)

సూరమాంబ:- దాదీ! మా చినబాబు ఎచటికి వెళ్ళినాడో ప్రొద్దుట నుండి కనబడలేదు. భోజనమునకు రాలేదు. వచ్చుచున్నాడేమో చూడుము.

దాసి:- (ద్వారముచెంతకు వచ్చి గాంచి లోపలికివెళ్లి) అమ్మా! అడుగో వచ్చుచున్నారు అయ్యగారు.

సూరమాంబ:- (ఎదురుగా వెళ్లి) ఏం బాబు, భోజనముకు రావడము వేళకూడా తెలియదా?

వేమన:- (విచారముతో ప్రవేశించి అచటనున్న కుర్చిలో కూర్చొనుచు) లేదు తల్లి! లేను. నేడో, రేపో యీ జీవితమును ఎడబాయు వానికి యింకను భోజనము ఎందుకమ్మా?

సూరమాంబ:- (ఆశ్చర్యముతో దగ్గరకు వచ్చి) అదేమి నాయనా అట్లనుచున్నావేమిా? ఏదో విచారముగా నున్నట్లున్నావు. ఏమి ఆ విచారము. ఏమిటి బాబు. నిన్ను ఎవరైనా ఏమైన దూషించారా చెప్పుము. నా మనంబు తత్తరమందుచున్నది. అట్టివారు ఎవరైనా వున్నచో యిప్పుడే మిా అన్నగారితో చెప్పి శిక్షింపజేసెదను. చెప్పుము బాబూ.

వేమన:- ఎవరేమి అనలేదు. మిారు శిక్షించనూ వద్దు.

సూరమాంబ:- మరేమిటి బాబు! నీ విచారము వివాహమా.

వేమన:- వివాహమంటినా. అమ్మా! నా కోరిక వేరు.

సూరమాంబ:- అట్టి కోరిక ఏమిటో చెప్పుము బాబూ! నీకు నా వలన అగు సహాయమును దైవసాక్షిగా నెరవేర్చెదను. ఏదీ చెప్పుము బాబు.

వేమన:- అటులయిన విశదపరచెదను. ఏది యన, ఈశ్వరుని ఫొటో గలిగి, మణితో నమర్చబడిన అంగుళీయకమును నేను ధరించ వలయునని నాకు కోరిక జనించినది. అదియే నాకు విచారము. అట్టి వస్తువును నా కొనగూర్చిన, సర్వ సౌఖ్యానందము లందు చుండెదను. లేనియెడల నాగతి యేమగునో నీవె గాంచగలవు తల్లీ ! (అని విచారపడును)

సూరమాంబ:- బాబూ! యీ స్వల్ప విషయమునకే యింత విచారమా ! ఆ కమసాలి అభిరామయ్య మీ అన్నగారి ఆజ్ఞలో వుండువాఁడె కదా! అతనిచే మీ అన్నగారితో చెప్పి చేయించె దను బాబూ!

వేమన:- అట్లు కాదు అమ్మా ! నేను చెప్పు విషయము సాంతముగా వినుము. నేను కోరిన వస్తువు ఈశ్వర విగ్రహము నమర్చి, రవ్వలతో కూర్చబడునట్టి వస్తువు గనుక, అట్టి వస్తువును యితరులు చూడ కూడదు. అతను స్నాన సంధ్యాదులను గావించి, శుచియై తెల్లవారుఝాము మొదలు, సాయంకాలము రెండు గంటల వరకు తా నెచ్చటికి వెళ్లకుండా కూర్చుని, మౌనముతో చేయవలయును. ఇట్లు తయారగు వస్తువును ధరించవలయునని నాకు వేడుకగా వున్నది. యిదియే నిన్ను కోరిన కోరిక. యిదియే నీవు నాకొనర్చు సహాయము.

సూరమాంబ:- బాబూ ! అటులయిన నీవు భోజనమునకు వెళ్లుము. యీ విషయము మీ అన్నగారి కెరింగించి చేయించెదను. —

వేమన:- అమ్మా ! అట్టి వస్తువు లభించు వరకు నాకు భోజనము అక్కరలేదు. యీ గడువు కాలములో ఏ సమయమున ఆ వస్తువు లభించునో ఆ సమయముననే, నా భోజనము. అప్పటి వరకు నన్ను పల్కరించవద్దు.

సూరమాంబ:- యింత పట్టుదలా బాబూ ! సరే మీ అన్నగారి కెరిగించెదను. (అని నిష్క్రమించును. అవనిక జారును)

(అవనిక నెత్తగా విశ్రాంతి భవనము. అనవేమన శయ్యయందు విశ్రమించి యుండును)

సూరమాంబ:- (ప్రవేశించి చిరునవ్వుమోమున భర్తయొక్క శయ్యకు ప్రక్కగా నిలబడి) నాథా! కమసాలి మీ ఆజ్ఞలోవుండి మన అంతఃపురములోనే దుకాణమువుంచి నగలుచేయుచున్నాడు కదా! ఎన్నాళ్ళనుండియో మణిరాయితో నమర్చబడి అందు ఈశ్వర విగ్రహము పొతికించిన అంగుళీయకమును ధరించవలయునని కుతూహలముగా నున్నది. అట్టి వస్తువును చేయించమని ప్రార్థన.

అనవేమన:- ప్రేమసీ! అట్టి కోరికవున్నయడల ఆలాగే చేయించెదను.

సూరమాంబ:- నాథా! ఆ వస్తువు రేపె తయారుకావలయును. యీ వస్తువు సామాన్యవస్తువులవలె కాదు. దీనికి నియమము గలదు. ఏదియన, ఒకప్పుడు ఒక జ్యోతిష్కుడు వచ్చి, మా తండ్రిగారికి జ్యోతిష్యము చెప్పుచు, నాకును జోష్యము చెప్పుచు యిట్లు పలికెను. అమ్మాయి నీవు అత్తవారింటికి వెళ్లినతరువాత ఈశ్వరుని విగ్రహము కలిగి అందు రవ్వలు నమర్చిన అంగుళీయకమును ధరించిన ఆయురారోగ్యములుగలిగి సకల సంపదలతో నీ జీవితాంతరము వరకు నీ భర్తనుగూడి సౌఖ్యానందము అనుభవింపగలవు అని పలికెను. నేను అట్టి వస్తువును ధరింపవలయునని అనుకొంటిని. కాని అది సమకూడలేదు. నేటికది లభ్యమగునని జ్ఞప్తికివచ్చినది. ఆ వస్తువును చేయునతడు స్నానసంధ్యాదులను గావించి, శుచియై మౌనధారిగా యితరులు చూడకుండా అట్టి వస్తువును తయారుచేయవలె. తాను చేయువస్తువు తయారగువరకు బైటకు పోకుండానున్న దుకాణము తలుపును మూసికొని లోపలనే చేయవలయును. మన దాసీలు మొదలగువారచ్చటకు పోనీయకుండా జాగ్రత్తచేయుటకు మన సేవకులను కాపలావుంచి అట్టి వస్తువును చేయించవలయును. అటుల నియమముతో చేయబడిన వస్తువుకు యితరుల దృష్టి దోషము తగులదు. అట్టిది సంకల్పమునకు కూడా

పనికివచ్చును నాథా! అభిరామయ్యను యిప్పుడె పిలిపించి యీ విషయము మాట్లాడి చేయించగలందులకు నా ప్రార్థన.

అనవేమనః- ప్రేయసీ! ఆలాగుననే అభిరామయ్యను యిప్పుడే పిలిపించెదను. (సేవకునిగాంచి) సేవకా యిటురమ్ము.

సేవకుడుః- ప్రభూ! ఆజ్ఞ.

అనవేమనః- సేవకా! అభిరామయ్యను త్వరగా తీసుకొని రమ్ము వెళ్లుము.

యవనిక నెత్తగా అభిరామయ్య గృహము.

అభిరామయ్యః- ప్రేయసీ! పరమేశ్వరుని ప్రీతిగా నాకష్టమునకు ప్రతిఫలము సమకూడు సమయ మాసన్నమైనది. ఏ సమయమున ఎవ్వనికేది లభించునో ఎవ్వరెఱుంగును. అంతయు ఆ పరమేశ్వరుని మహిమ. కాకున్న యీ సృష్టిలో సూక్ష్మవస్తువు మొదలు మహామేరు వరకు సృష్టింపు ఎందునిమిత్తమో ఎవ్వని కెరుక అట్టి లీలావతారుండైన ఆ పరమాత్మ స్వరూపుని గాంచి కార్య సాఫల్యత నొందెదగాక. (అని ధ్యానించుచు)

సీ. స్తంభమందుదయించి దానవేంద్రుని ద్రుంచి
కరుణతో ప్రహ్లాదు గాచినావు
మకరిచే జిక్కి సామజము దుఃఖింపంగ
గృపయుంచి వేగ రక్షించినావు
శరణంచు నా విభీషణుడు నీ చాటున
వచ్చినప్పుడె లంక నిచ్చినావు
అల కుచేలుడు చేరె డటుకు లర్పించిన
బహుసంపదలు నిచ్చి పంపినావు

గీ. నీదు మహిమను గనుగొన నెంతవాడ
అఖలదేవాదిదేవ నిన్నరసి నేను
వేడుకొంటిని యిప్పుడు వేదమూర్తి
యిందిరారమణ నన్నింక యెలయ బ్రోవు.

పార్వతమ్మ:- నాథా ప్రొద్దు పోయినది. స్నానముచేయుడు. భోజనము సిద్ధమయినది. మన కన్నిటికి పరమేశ్వరుడే గతికుడు.

అభిరామయ్య:- దేవీ వచ్చుచున్నాను, యెంతోకాలమునుండి ఆ ముసీశ్వరునికి సేవజేసిన ఆయన నేడు నన్ను పల్కరించి, శిష్యా, నీవు రేపు వుదయము పదకొండు గంటలకు, యిచ్చట వుండుము. అప్పుడు నీకు మంత్రోపదేశమును గూర్చెదను. గడువు కాలమును తప్పించకుము, అని ఆజ్ఞ యిచ్చెను. తెల్లవారగనే నేనువెళ్లి అచ్చట వుండవలయును. యీ లోపల ఏ అంతరాయములు రాకుండుగాక యని ఆ సర్వేశ్వరుని ధ్యానించు చుంటిని.

పార్వతమ్మ:- ముందు రాబోవు విషయములు ఎవ్వనికెరుక నాథా! ఆ సర్వేశ్వరుడే మనపాల గలడేని, సర్వమును సిద్ధింపజేయును, రండు వేళ్లయినది. (అని లోనికి నిష్క్రమించును, అభిరామయ్య నిష్క్రమించును, అవనికజారును.)

(అవనికనెత్తగా అదే రంగము)

సేవకుడు:- (ప్రవేశించి) యిదియె కాబోలు అభిరామయ్య గృహము. పిలిచెదగాక, అభిరామయ్యా (అని పిలుచును.)

అభిరామయ్య:- (లోపలనుండి) ఓహో! నేను అనుకున్నట్లు జరుగునా దరిద్రునికి క్షుద్బాధ ఎక్కువ అన్నట్లు ఎవరోవచ్చి కేకలు వేయుచున్నారు. వెళ్లి కనుగొనెదగాక (అని తలుపుతెరచి) ఎవరు కేకవేసినది.

సేవకుడు:- నేను రాజుగారి సేవకుడను. నిన్ను రాజుగారు త్వరగా అంతఃపురమునకు రమ్మని చెప్పినారు.

అభిరామయ్య:- సరె నీవు వెళ్లుము. యిప్పుడే వచ్చెదను.

సేవకుడు:- అట్లు కాదు. నిన్ను వెంటకొనిరమ్మని చెప్పిరి.

అభిరామయ్య:- యిప్పుడే వీని దర్శనము కలిగిది. యికను రేపు సాయంకాలము వరకు ఎట్లు జరుగునో. (అని లోపలికి వెళ్లి, వెంటనే ప్రవేశించి) సరే వెళ్ళుదము రమ్ము.

(అని యిరువురు నిష్క్రమింతురు. అవనిక జారును

(అవనిక నెత్తగా రాజాంతఃపురము. అనవేమన, అభిరామయ్య, సేవకుడు వుందురు.)

అనవేమన:- అభిరామయ్యా! నీకు యిప్పుడు పనికల్పింపబడినది. యీ సమయము మొదలు సాయంకాలము రెండు గంటలకు ఒక వస్తువును తయారుచేయవలయును. ఆ వస్తువుఏదిన, యీశ్వరుని విగ్రహము, అందు మణితో నమర్చబడిన శిఖాముద్రికను తయారు చేయవలయును. ఆ వస్తువును నీవు స్నాన సంధ్యాదులను గావించి శుచివై (గదిని జూపి) యిదిగో యీ గదిలో దుకాణము వుంచి యితరుల ఎవరిని పలుకరించకుండా తలుపు వేసుకొని అందు మౌనముతో తయారు చేయవలయును. వెళ్లుము.

అభిరామయ్య:- ప్రభూ ! గృహమునకు వెళ్లి యిప్పుడే వచ్చెదను శెలవు —

అనవేమన:- నీవు గృహమున కెళ్లి ఎంత ఆలస్యము చేయుదువో. యీ సేవకుడు వచ్చును. సేవకా నీవును వెంటవెళ్లి త్వరగారండు.

సేవకుడు:- చిత్తము ప్రభూ! (అని యిరువురు నిష్క్రమింతురు.)

(అవనికజారును)

(అవనిక నెత్తగా అభిరామయ్య గృహము)

అభిరామయ్య:- (విచారముతో ప్రవేశించి) ఎంతలో ఎంతమార్పు వచ్చినది, ప్రేయసీ, మునీశ్వరు డొసంగిన గడువు కాలముకు అంతరాయము కల్గినది కదా.

సీ. కూటికోసరము నే కొరగాని జనులచే
బలుగద్దరింపులు పడగవలసె
దారాసుత భ్రమల దగిలి యుండుటచేత
దేశ దేశములెల్ల తిరుగవలసె
బెను దరిద్రతపైని, బెనగి యుండుటచేత
జేరి యీకొలువును చేయవలసె
అభిమానములు మదిని నంటియుండగ గదా !
పరులజూచిన సిను పడగ వలసె

గీ. నిటుల సంసార వారాశి నీదలేక
తుదకు యీ రాజు కొలువునం జేరి యుండి
వీరి యాజ్ఞకు లోబడి యుండినపుడు
ఎట్లు పోవును యోగీంద్రుపట్ల భక్తి.

కాని నా మనస్సున ఎటుపోవుటకును బాలుపోవుటలేదు. ఏమి చేయుదును. (అని విచారపడును.)

పార్వతమ్మ:- నాథా! ముందెప్పుడో రాబోవు సౌఖ్యమునకు ఆశ పడుటకంటె యీ సంసారములో నుండి ఏ కష్టములు కలుగకుండా అన్ని సౌఖ్యములు అనుభవించుచుండుట మేలుగదా! కావున మునీంద్రుని యాజ్ఞకంటె గృహస్థాశ్రమమే మంచిది. గాన మునీంద్రుని యాజ్ఞ వీడుటయే వుచితమని నా యభిప్రాయము.

అభిరామయ్య:- దేవీ! నాకును అదియే తోచినది. యింక నే రాజుగా రానతి ప్రకారము వెళ్ళెదను. స్నాన సంధ్యాదులను గావించుకొని అచ్చటికి వెళ్ళవలె.

(అని లోనికి నిష్క్రమించును. అవనిక జారును)

(అవనిక నెత్తగా కమసాలి నగలదుకాణము)

అభిరామయ్య:- అహా పరమేశ్వరా! నీ లీలావిషయము లెవ్వరి కెరుక దేవా! జన్మసాఫల్యతకొరకు ఎంతయో కష్టపడి ఆ మునీశ్వరునికి సేవజేసిన ఆయన కరుణించి మోక్షఫలదాయకమగు మంత్రమును యిచ్చెదను; నీవు రేపు ఉదయము పదునొకండు గంటలకు రమ్మని బల్కిన కొండంతయాశతో నీ నామస్మరణము గావించుకొనుచు సంతోషానందముతో నుండి తగుప్రయత్నములో నుండునంతలో యీ అంతరాయము కల్గినది.

సీ. అలనాడు సురలను అసురులు బాధింప
వేడగా రక్షగావించినావు
అలనాడు ద్రౌపది హా కృష్ణ! యని వేడ
ఇంపుమీఱగ వలువ లిచ్చినావు

అలనాడు కరిరాజు నభయమ్ము వేడగా
వేగమే మకరి నొప్పించినావు
తాపసకన్యలం దనుజులు చెఱబట్ట
వేడగా రక్షించి వెలసినావు
గీ. ఇట్టి నీయందు భక్తుల నెన్నరాని
యంతమందికి నుపకృతు లరయజేసి
వలుతెలుంగుల నుతికెక్కి ప్రబలినావు
నన్ను గాపాడ భారమా నళిననేత్ర.

దేవా! నిన్ననసేల? నా పాపఫలమే నన్నిట్లు కట్టివేసినది. కానిమ్ము. సర్వదా నీవే రక్షకుడవు. నే నిక మౌనముదాల్చి వస్తువును చేయుదునుగాక (అని దుకాణము తలుపును మూసికొని లోపలి భాగమున వస్తువును చేయుట ప్రారంభించును. అవనిక జారును)

(అవనిక నెత్తగా అంతఃపుర భాగము వేమన శయ్యామందిరము)

వేమన:– (నిద్రనుండి లేచి) ఓహో! తెల్లవారినది. నేను కాల కృత్యములను దీర్చి, త్వరగా పూజా ద్రవ్యములను సేకరించి, ఆ యోగీంద్రుని దర్శనమునకు వెళ్ళెదను గాక! యిప్పటికి నా యుక్తి ఫలించినట్లే వున్నది. యికముందు యెట్లు జరుగునో. (అని లోనికి నిష్క్రమించును) (మరల వెంటనే ప్రవేశించి) నేను అభిరామయ్య వలె వేషమును మార్చెదను గాక! (అని జంధ్య మును ధరించి, బిళ్లగోచి, భుజముపై అంగోస్త్రము, విభూతి రేఖలు ధరించి, తన వేషమును అద్దమున గాంచి) భేష్! యీ వేషము అభిరామయ్యకు వలెనున్నది. కావున ఆ పరమేశ్వరుని ధ్యానించుచు వెళ్ళెద గాక!

సీ. ఎవ్వని యాజ్ఞచే యెల్లలోకంబులు
సృష్టింపు అయ్యెనో చోద్యముగను
ఎవ్వని యాజ్ఞచే అనలుండు అనిలంబు
సతతంబు నిడుచుండె, సౌమ్యముగను

వేమన మాహాత్మ్యము

ఎవ్వని యాజ్ఞచే వాయువు యేవేళ
వీచు చుండెను ఎపుడు హాయిగొలుప
ఎవ్వని యాజ్ఞచే ఎల్ల సముద్రాలు
మేర మీరకయుండె మహిమచేత
గీ. అట్టి దేవాది దేవుడౌ నట్టివాని
భువనముల బోజ్జలో, నింపినట్టి వాని
అఖిల దిక్కుల కాధారమైన వాని
వానినే వేడుకొందును యతడె దిక్కు.

కావున ఆ పరమాత్మ స్వరూపిని ధ్యానించుచు ఆ యోగీంద్రుని వద్దకు వెళ్లెదగాక.

శ్రీ వల్లుల్ల గోత్రోద్భవ లంకిరెడ్డి సకలారెడ్డి పౌత్ర కోటిరెడ్డి పుత్ర
వెంకట సుబ్బారెడ్డిచే శ్రీ ఉమామహేశ్వరస్వామి వార్ల
కృపాకటాక్ష వీక్షణములచే వ్రాయబడిన
శ్రీ వేమన మాహాత్మ్య మను నాటకమునందలి
తృతీయాంకము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

---

# శ్రీ వేమన మాహాత్మ్యము

అను

# నాటకము

## చతుర్థాంకము

(అవనిక నెత్తగా కొండప్రదేశము
ఆశ్రమమున శివరామయోగి తపస్సుచేయుచుండును)

వేమన:- (ప్రవేశించి చేతనున్న ఫలపుష్పాదులు గలిగిన పళ్ళెమును యోగీంద్రుని ముందుపుంచి యీవలకువచ్చి ప్రక్కగా నిలబడి వుండును)

శివరామయోగి:- (కనులు తెరచి, వేమనను గాంచి) భక్తవర్యా! వచ్చితివా అచ్చట నిలబడివుంటివేమి? యిటు రమ్ము. (జూపుచు) యిది యోగాసనము. దీనిపై ప్రాఙ్ముఖముగా ఆసీనుడవుగమ్ము.

వేమన:- ఆలాగే స్వామి (అని తూర్పువైపుకు ముఖము పెట్టి కూర్చుండును)

శివరామయోగి:- భక్తవర్యా! యిదిగో మంత్రోచ్చాటనము గావించెదను వినుము. (అని వేమన చెవియొద్ద)

శ్లో. గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురువే నమః.

(శ్లోకము చదువును) శిష్యా! యిదియే మంత్రము. దీనిని సదా భక్తి శ్రద్ధలతో పఠించితివేని దీనివలన మోక్షమును యిష్ట సిద్ధులను బడయగలవు. యిదిగో ఓంకారముతో కూడిన అక్షర బ్రహ్మము. యీ విద్యనుకూడ నీ కొనగూర్చెదను. నీ జింహ్వ జూపుము. యిది బీజాక్షరము. యీ బీజాక్షరము కూడా కలిగి యుండిన నీవు విద్యావంతుడవై అందు రహస్యమంతయును గ్రహించి, దివ్య జ్ఞానమను శక్తిని బడసి విద్వజ్జనంబులలో

మేటివై లోకంబున హితమును గూర్చుచు, యోగ జ్ఞానముచే యోగివైలోకంబున పూజింపబడుచుందువు. (అని బీజాక్షరమును వ్రాయుచు) నీకు యిచ్చటనుండియే జ్ఞానశక్తి యను దివ్య తేజస్సు ఆవహించును. వుండుము. (దివ్యజ్ఞానమున జూచి) ఓహో! ఎంత మోసము జేసితివోయి. నీ వెవరవో, నీ కీ రహస్యము ఎట్లు తెలిసి వచ్చితివో దాచక నిజముచెప్పితివేని నీకు నేచెప్పిన విద్యారహస్య మంతయును నీకబ్బును. లేనియెడలవృథాయగును. నిజముచెప్పుము.

వేమన:- స్వామి దివ్యజ్ఞానముచే నా రహస్యమంతయును గ్రహించిన నేనేమి చెప్పువాడను దేవా! నాడు, తమరు అభిరామయ్యతో బల్కు రహస్య వచనంబులను నేను రహస్యముగావచ్చి వినినవాడనై యిట్టి కార్యమునకు గడంగితిని. దేవా! నన్ను కరుణించి రక్షించ వలయునని వేడుకొను చున్నాను. స్వామీ (అని నమస్కరించును.)

శివరామయోగీ:- సరే, శిష్యా ఎవరైనను నాకేల యెవ్వరికైనను గుణమే ప్రధానము. అతడు కష్టపడి ప్రతిదినము నాదర్శనము కొరకు వచ్చుచున్నాడని కరుణించి ఆ సమయమునకు రమ్మని బల్కితినేకాని, ఏ వేళకు నాతపస్సు పూర్తి యగునో ఆ సమయ మునకు ప్రాప్తమున్నచో ఫలమేల దప్పును? అను సామెత గల్గినట్లు ఆబాటనుబోవు ఏబాటసారిని అయినను దగ్గరకుపిలిచి నావిద్యను అతనికి బోధింపవలయును గాన నీకు ప్రాప్తమయిన దాని కెవరేమి చేయగలరు? శిక్షించుటకును, రక్షించుటకును, యీ విషయమునకు అభిరామయ్యయే కర్త గావున అతని దీవనలేనిదే నీకు ముందు ఫలితము చేకూరదు. వెంటనే వెళ్లి అతనినే వేడుకొనుము. నేనిచ్చట నుండుటకు వీలులేదు. నా కనుష్ఠానకాలము అయినది. నేను వెళ్లు చుంటిని. యిక నీవు వెళ్లుము. (అని నిష్క్రమించును)

వేమన:- (యోగి వెళ్లెడి దిక్కేజూచుచు) అదిగో యోగీంద్రులవారు కనుచూపుమేర దూరమువెళ్లిరి. నేనును వెళ్లెదగాక! అభిరామయ్య వద్దకువెళ్లి ఆయననే వేడుకొనెదగాక (అని నిష్క్రమించును.)

(అవనిక నెత్తగా అంతఃపురభాగము, అభిరామయ్య దుకాణము)

వేమన:- (ప్రవేశించి అభిరామయ్యను గాంచి పాదములపై వ్రాలి) అభిరామయ్యగారు మీ ప్రయత్నమునకు అంతరాయము కలిగించి తమకు రానున్న ఫలితమును సంగ్రహించిన ద్రోహుం డిదే నమస్కరించుచు, తప్పిదమును మన్నించవలయునని వేడుకొనుచున్నాడు.

అభిరామయ్య:- (వేమనను గాంచి నివ్వెరపాటుతో లేవనెత్తుచు) చినబాబుగారా! ఏమి యీ వేషము, యీ విభూతి రేఖలు, యీ జంధ్యము, సరే నా పాదము పట్టుట యేమిటి. తప్పు. ఏమిటి ద్రోహము, ఏమిటి మన్నించడము. ఏమిటి బాబూ! మీ అన్నగారు గాంచిన ఆగ్రహించుదురు.

అనవేమన:- (తొందరగా ప్రవేశించి అభిరామయ్యను గాంచి) అభిరామయ్య! చినబాబు అనుచుంటివి ఏడీ మా బాబు. (అభిరామయ్య పాదములంటి వేడుకొనుచున్న వేమనను గాంచి) దేవీ! యిలా రమ్ము. త్వరగా రమ్ము.

సూరమాంబ:- (తొందరగా లోపలినుండి ప్రవేశించి) ఏమిటి నాథా! (వేమనను గాంచి నివ్వెరపాటుజెంది) బాబు అదేమి? అభిరామయ్య కాళ్లుపట్టుకొని వేడుకొనుచున్నావు. ఎంత అవమానకరము. (భర్తనుగాంచి) నాథా! యీ చిత్రమేమిటి.

వేమన:- (వారల గాంచకయే) దేవా! నన్ను క్షమించవలసినది. మీ కస్యధా నెగ్గుతలపెట్టిన కఠినాత్ముడను, ప్రార్థించుచుంటిని.

అభిరామయ్య:- (వేమనను లేవనెత్తి) బాబు! నీవు నాయందు కల్గించిన ద్రోహమేమిటి చెప్పుము. బాబు ఎవరినిఅయినను శిక్షించుటకును, రక్షించుటకును, మీ అన్నగారె నాయనా! నేను అంతటివాడను గాను. మీ యాజ్ఞలకు లోబడి కష్టపడి బ్రతుకు వెళ్ళబుచ్చువాడను బాబు. ఏమిటో విషయము చెప్పుము.

అనవేమన:- (ఆగ్రహముతో) ఓరీ క్రూరాధమా! అభిరామ నీ వంటి వానికి వుద్యోగముయిచ్చి మా కోటలోకి రానివ్వటమే పొరబాటు

పని. నీ విషయమును గ్రహించకుండా, ఆ నాడు పనిలేక, పొట్ట గడవక పనిలేనివానివలె వచ్చి వేడుకొనిన నా కెంతయో జాలికలిగి మా అంతఃపురములో నీ కులవృత్తిని చూపితిని. కుక్క సింహమై నట్లు చివరకు మాచేతనే నీ కాళ్ళు పట్టించుకొంటివిగా! చండాలా! పొమ్ము. దుకాణమునుండి వెడలిపొమ్ము. నీ విక యిటనుండుటకు వీలులేదు వెళ్ళుము.

అభిరామయ్య:- (అనవేమన పాదములు పట్టుకొని విచారముతో) ప్రభూ! నే నేమియు యెరుగను. మీ పాదములుసాక్షిగా మీ యాజ్ఞను శిరసావహించి భయభక్తులతో నా జీవితమును గడపు కొనుచుంటిని దేవా! యిందు విషయమేమిటో నాకు తెలియదు ప్రభూ!

అనవేమన:- అభిరామా! యిందు విషయమేమిటో గ్రహించెదను. నీవు మాట్లాడవలదు (అని వేమననుగాంచి) బాబూ! వేమన ఎంత అవమానకరమైన పనిచేసితివిరా! ఎంతఆశ్చర్యము. ఎంతనీచత. పొట్టకూటికి మన కడ వుద్యోగముండిన వానిని వేడుకొనుటా?

వేమన:- (అనవేమన మాటలను వినిపించుకొనకయే) గురు అభి రామయ్యగారూ! నన్ను కరుణించి నా తప్పిదమును మన్నించి నను కృతార్థునిగా జేయుము. తండ్రీ! నీవు నాకొక గురువువు. యిప్పటినుండి నాకు గల్గిన విద్యా విధానమునకు మీరే గురువులు కావున నా జింహ్వాయం దుద్భవించు లోకోపకార మను విద్య మీ వలననే నాకు గల్గినది. కాన, శెలవీయ వేడుకొను చున్నాను దేవా!

అభిరామయ్య:- (తనలో విచారముతో) నేను ఎటు సంభాషించు టకును మెడకత్తెర లాగున్నది. అయిన యితను నాకు గల్గించిన ద్రోహమును యితని చేతనే చెప్పించెదను. అప్పటికైనా రాజు గారికి నాయందు కనికర ముండకపోవునా యిప్పుడే తెలియగలదు. (వేమననుగాంచి) బాబూ! చాలా ఆశ్చర్యము కల్గించు యీ వాక్యములందు అర్థమేమొ నాకు తెలియుటలేదు. అందేమి యొనర్చితివో విశదీకరింపుము. శెలవిచ్చితిని.

వేమన:- మహానుభావా ! నేటికి కృతార్థుండ నైతిని. యిదిగో చెప్పు చుంటిని. నా ద్రోహము.

చం. యోగికి పూజసేయుటకు నేగుటగాంచియు నేనువచ్చి
నీవువ్వట సేయుపూజలును యోగియు నిన్గని బల్కు వాక్యముల్
ఎంతయొ ప్రీతిగావినియు, వెంటనె యింటికివచ్చి నేను
మా వదినెను వేడి నీ కవుడు వస్తువు కల్పనచేసి పంపితిన్.

అభిరామయ్య:- బాబూ! జరిగినది యేదియో జరిగినది. యింక విచారమేల. నేనేమో దూషించు తాననిగదా, నీ తలంపు. అట్లెన్న టికిని జరుగదు. కష్టపడితిని. ప్రతిఫలమును గైకొనలేక పోయితిని. నా దురదృష్టమే నన్నిట్లు, కట్టి వేసినపుడు ఎవరేమి చేయగలరు ? యీ ప్రతిఫలము నీకు గల్గియుండినదిగదా యను ద్రోహ చింత నాకెన్నటికి గలుగదు. కల్గియుండలేదు. యిట్టి ఫలితమును నీవు జెందివచ్చితివన్న నాకెంతయో సంతోషానందము గల్గినది. ఏది ఆ యోగీంద్రులవారు చెప్పిన వేదవాక్యములు నాకు కర్ణా నందము గల్గునట్లు గావింపుము. ఒక్కసారి.

వేమన:- గురూ ! ఆ యోగీంద్రుల వారొసంగిన వేదవిద్యను చెప్పుచున్నాను వినుము. నేను మీయందు గురుభావము వహించి లోకంబున మీ నామము శిరస్థాయిగా నుండునట్లు నేను చెప్ప బోవు ప్రతివాక్యమునందును ముందు మీ నామమును ఉచ్చరించు కొనుచు లోకంబున సంచరించెదను గాక శలవు.

ఆ. వె నీటిలోని మీను, నెరిమాంస మాశించి
గాలమందు జిక్కు, కరణి భువిని
ఆశవగిలి నీవు ఆలాగె చెడలేదె
విశ్వదాభిరామ వినుర వేమా.

యిదే నా నమస్కారము. గురూ ! శలవు.

అభిరామయ్య:- (ఏడ్చుచు) హా నాకర్మ హా హా (అనుచు పడిపోవును)

అనవేమన:- (విచారముతో అభిరామయ్యను లేపనెత్తి) అభిరామయ్యా నిజము తెలియక నిన్ను దూషించితిని. యిప్పటికి తెలిసినది.

వేమన:- అన్నయ్యా ! మీ కిదే నా నమస్కారము. (వదినెగారిని గాంచి) అమ్మా ! నీయందు గురు, మాతృభావముల వహించుకొని కృతార్థుడ నైన యీ వేమన నమస్కరించుచున్నాడు తల్లీ ! గైకొనుము. (సోదరిని గాంచి) అమ్మా సోదరీ ! నీ వెల్లప్పుడును దీర్ఘ సుమంగలివై యుండుదువు గాక ! యిదే అన్నయ్యా ! శలవు. (పోబోవును)

(అన వేమన, సూరమాంబలు అడ్డము వచ్చి) నాయనా ! ఎచ్చటికి. అల్లారుముద్దుగా బెంచిన మా ముద్దు ముచ్చటలను మరచిపోతివా. వలదు. నీ వెచ్చటికి పోవలదు. (అని అడ్డగించును)

అనవేమన:- (భార్యను గాంచి) దేవీ ! యిదియంతయు నీవలన జరిగినట్లు అర్థమయినది. నిజమేనా ?

సూరమాంబ:- నిజమే నాథా ! యిందు సందేహము లేదు. నాకును మన అబ్బాయి యుక్తి తెలియక చిత్రమైన అంగుళీకమును ధరించవలెను. దానిని చేయించునంత వరకు భోజనము మానెదను త్వరగా చేయించుము. అని అడుగగా నా కెంతయో జాలి గలిగి, నేను గ్రహించక నిజమే అనుకొని గడువు ప్రకారం కావలెననిన అట్టి వస్తువును మిమ్ములను చేయించమని ప్రార్థించితిని. యిట్లు జరుగునని నాకు మాత్రము తెలియునా. నాథా !

వేమన:- అన్నయ్యా ! యీ విజ్ఞానమంతయు మా వదినెగారి సహాయముచే లభించినది. నేటినుండి జ్ఞానశక్తి యను తేజస్సు నాలో ఆవహించినది. నన్ను లోక సంచారిగా నుండుటకు పిలచుచున్నది. 'ఎవరికి వారె యమునాతీరె' అన్నట్లు ఎవరికి వారె. గాన, మీతో నాకు సంబంధము లేదు. యిది యంతయు భ్రమ. నేటి నుండియే యీ ప్రపంచ వస్తువులను సన్యసించితిని. నేను వుండుటకు వీలు లేదు. యిదే శలవు. (అనుచు వెడలును)

అనవేమన, అన్నపూర్ణ (హా ! సోదరా ! సోదరా ! హా ! అని మూర్ఛ పోవుదురు. సూరమాంబ భర్త పాదములపై వ్రాలును. అవనిక జారును)

(అవనికనెత్తగా పట్టణమువీధి)

వేమన:- (ప్రవేశించి) ఆహా పరమేశ్వరా ! యీ మాయాప్రపంచము నందు నీ సంకల్పముచే సృష్టింపబడిన యీ విచిత్రము అంతయును మానవజాతి మేలునకేగదా. అట్టి విషయము తెలిసి యుండియు, మానవజాతి నీవొనర్చిన మేలును మరచి సదా విషయవాంఛలకు లోనై స్వప్న మందైనను నీ నామస్మరణము దలంచక కామమను చీకటిలోను సంసారమను సాగరములోను జిక్కువడి అందుకోరికలు నెరవేర్చుకొనుచు తుదకు పరలోక సౌఖ్యమునకు మార్గ మెరుంగ లేక అధోగతి జెందుదురుగదా.

చం. పుట్టుచు, చచ్చుచున్ నరుడు బొందుచు నుండియు కష్ట సౌఖ్యముల్
జెందుచునుండె గాని యెపుడేనియు నీ పద సేవ భక్తియున్
జేసిన స్వర్గలోక సుఖ సౌఖ్యములన్ ఒనగూర్చి యెప్పుడున్
మానవ రక్షణం బటుల జేయుచు నుందువుగాదె ఈశ్వరా.

ఎంత మహాత్మ్యము దేవా! ఆది అంతములేని నీ స్వరూపమును గాంచుటకే గదా! మహా ఋష్యాదులు కొండ గుహాలయందు సర్వదా దీక్షబూని యుండిరి. దేవా ! యిదే నమస్కారము. (నిష్క్రమించి వెంటనే ప్రవేశము) అదిగో అచ్చట నేదియో కో లా హ ల ము గా నున్నదే. ఏ మా కో లా హ ల ము. (పరికించి) జన సమూహము. వారితో నాకేల ? అదిగో ఆబాట ప్రక్కన నీళ్లు గానవచ్చుచున్నవి. అచ్చటకువెళ్లి స్నానముజేసి భగవంతునికి అర్ఘ్య పాద్యాదులను గావించెదను గాక (అని నీళ్లు గల స్థలముకువచ్చి అందు దిగి బురదగలిగిన నీటిలో స్నానము చేయుచుండును. అందు బాటప్రక్కన పోవుచున్న జనసమూహము గాంచి అందు)

మొదటివాడు:- యెవడో పిచ్చివాడు. చూడండిరా. ఆ మురుగు నీటిలో కూర్చుని స్నానము జేయుచున్నాడు.

వంటినిండా బురదే

ఆ. వె. ఓగు నోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని
భావమెచ్చు మెచ్చు బరమలుబ్ధు
పంది బురదమెచ్చు పన్నీగు మెచ్చునా
విశ్వదాభిరామ వినురవేమ.

అను సామెత గలిగి నట్లున్నది. వీనిచర్య.

వేమనః- (వారలగాంచి తనలో నవ్వుకొనుచు) ఏమి వీరి మూఢత్వము.

ఆ. వె. మాయచే బుట్టియు మాయచే బెరిగియు
మాయ నెరుగలేక మమతజెందె
మార్గ మెరుగలేక మందులై యుండిరీ
విశ్వదాభిరామ వినురవేమా.

యిట్టి మాయా ప్రపంచమున మాయాంధ కారమను మోహము నకు జిక్కి షడ్వర్గములకు లోనై కాలము గడుపుచున్న యీ మానవజాతి యొక్క లక్షణంబులను గాంచిన యెంతయో ఆశ్చర్యంబు గలుగుచున్నదిగదా.

రెండవవాడుః- ఓయి పిచ్చివాడా! ఏల యీ బురదనీటిలో ఈదులాడెదవు అదిగో, కొంతదూరమున చెరువు వున్నది. అచ్చట శుభ్రమైన నీరున్నది. అందు దిగి బురదను కడుగుకొని స్నానము చేయవచ్చును. మాతోరమ్ము మేము చూపిస్తాము.

వేమనః- మీరు ఎచ్చటకు వెళ్లుచున్నారు.

రెండవవాడుః- వేమా! అదిగో ఆ కనపడు పల్లెలో అనవేమన రాజుగారు గుడికట్టించి అందు దేవుణ్ణి పెడతన్నారట. గొప్ప సంబరము జరుగునట. అక్కడ యింకా పప్పన్నాలు పెడుతున్నారట. నీవుకూడా రా, కడుపునిండా అన్నము పెడుతారు. అన్నముతిని సంబరము చూడొచ్చు. ఏనుగులు, గుర్రాలు వచ్చాయట. చూడొచ్చు. రా వెళ్లుదాము.

వేమనః- ప్రజలారా! మీరు సంబరముకొరకు అన్నము కొరకుగాని స్వామి భక్తికి గాదా పోవుట.

మూడవవాడు:- ఓహో పిచ్చివాడా ! స్వామిభక్తి అంటె నీకు తెలుసుకాబోలు. అందుకనియే ఆ బురదగోతిలో కూర్చుని యుంటివి. స్వామిభక్తి అంటె ఏమిటి మాకు తెలియదు. అచ్చటికి వచ్చే రాజుగారి ఏనుగులను గుర్రాలను చూచుటకే పోవుచున్నాము.

వేమన:- (తనలో) యిట్టి మూఢాంధులకు కొంత మహిమను చూపించెదను గాక. (ప్రకాశముగా) ప్రజలారా! మీరు వెళ్లండి. నేను స్నానము చేసి వచ్చెదను.

మూడవవాడు:- సరే. నీ యిష్టము. మేము వెళ్ళుచున్నాము. (అని పోవుదురు)

వేమన:- (బురద నీటిలో స్నానము చేయుచు) యీ శరీరావయవము లకు కలుగు శీతోష్ణంబులతో నా కేమి పని. అసలు ప్రపంచ సౌఖ్యములనే సన్యసించిన వానికి యిప్పుడు యీ శరీరాభి మాన ములు మాత్రము నా కెందులకు? (అనుచు నీటినుండి బయటకు వచ్చి అచ్చటనున్న వస్త్రమును తీసి ధరించబోవుచు) ఓహో ! పొరబడుచుంటిని. యీ వస్త్రము పుట్టుకయందే యుండెనా? లేక మధ్య వచ్చినదా? (యోచించి) లేదు లేదు. వరాహ పురాణములో విష్ణువు చెప్పినట్లు జీవుడు పిండరూపము. అనగా, చీము నెత్తురులు, మాంస బొమికెలు, నరములు మొదలయినవి గల దేహపంజరము గల పిండ రూపముతో గల్గెనని చెప్పబడియుండె గాని, వెంట నేమియు గల్గియుండినట్లు చెప్పలేదు గదా! ఇది మధ్యనే గల్గినది. సర్వమును సన్యసించినవానికి యివి మాత్రము నా కేల? దీనిని విసర్జించెదను. (అని పారవేయును. ఎదుట గాంచి) అదిగో ఆ కనబడునదే కాబోలు ! దేవాలయము. అచ్చటికి వెళ్ళి, అట జరుగుచున్న పూజా పునస్కారములను తిలకించెద గాక !

(అని నిష్క్రమించుచు. అవనిక జారును)

(అవనిక నెత్తగా దేవాలయము కాన్పించును. అందు అనవేమన, సూర మాంబ రాతివిగ్రహమును పట్టుకొని ప్రతిష్ఠింపజేయుచుండ పురోహి తులు మంత్రపఠనము గావించుచు మంత్రపుష్పము జెప్పుచుందురు.

దాసీలు అన్నపూర్ణ జూచుచుందురు. ప్రజలు జయ జయధ్వనులు జేయుచుందురు)

వేమన:- (ప్రవేశించి జనసమూహమును గాంచి) ఆహా! ఏమి వీరి కోలాహలము.

ప్రజలు:- (వేమనను గాంచి) పిచ్చివాడు పిచ్చివాడు (అని గోల చేయుదురు)

మొదటివాడు:- ఆ బురదగోతిలో కూర్చునివున్న పిచ్చివాడె యితను. బురద కడగకుండగనే వచ్చాడు. ఆ చేతులనిండా బురదమట్టి మన బట్టలకు రాస్తాడేమో ఎడముగా వెళ్లుదాము పదండి. (అని తొలగుదురు. దేవాలయము లోపలికి బాటగా ఏర్పడును)

వేమన:- (తనలోనవ్వుకొనుచు) పిచ్చివాడనే, పిచ్చివాడిని. (ప్రకాశముగా)

సీ. మాయాంధకారమున్ బాయగా లేకుండి
మూఢులై తిరిగెడి మాన్యులార
మద మత్సరములచే మాయను గనలేక
పరభామలను గోరు పాపులార
మానాభిమానముల్ మది నెంచగాలేక
ద్రిమ్మరులై తిరుగు దుష్టులార
మన మేలు నెంచెడి మాధవు భజనంబు
మదిని దలచక దిరుగు నధములార
గీ. వలదు మీరిట్టి భ్రమలలో వలలజిక్క-
స్వామిభక్తియె జన్మకు సార్థకంబు
వేరు వృత్తుల విడనాడి విష్ణుభక్తి
నుండి ముక్తిని గాంచు డమోఘముగను.

(దేవాలయము నందు కనబడుచున్న వారినిగాంచి) అదుగో! నా అన్నగారు, వదినగారు, నా సోదరి అన్నపూర్ణ, యింకను తదితరులు. వీరికి నా మహిమను చూపించి వీరికి నాయందుండు బంధుప్రేమయనెడి ప్రేమలతను త్రెంపించెదను గాక! నేను యీయనగారిచే ప్రతిష్ఠించ బడిన విగ్రహము నకు అభిషేక మహాత్స

వము గావించెదనుగాక. యిచ్చటెచ్చటనైనా జలము దొరుకునేమొ గాంచెదను. (అని అటునిటు పరికించి) యిదిగో యీ గుంటలో కొంచెము నీరువున్నది. అదియె చాలును. (అని అచ్చటకువెళ్ళి దోసెడు బురదనీరును పట్టుకొని కనుల కద్దుకొనును)

మొదటివాడు:- (వేమనను గాంచి) చూడండి! చూడండి! ఆ బురద నీరు దోసిటబట్టి యిటే వచ్చుచున్నాడు. పాడు మురికినీరు. పదండిరా! దూరముగా వెళ్ళుదాము.

వేమన:- (జలమును దోసిటబట్టి దేవాలయము లోపలికి వెళ్ళుచు)

చం. ఎవ్వ డనాథిమాథ్యు లయుడెవ్వడు వానిని నాత్మలోన
 నే అరమరలేక ఎప్పుడును ఆ విభుగొల్చెడి వాడనేని
 యీ ఆలయమందు కేగి అభిషేకము జేసెద యీ జలంబుచే
 జలమటు సోకి విగ్రహము స్వర్ణమయంబుగ నుండు గావుతన్.
 (అని లోపలికి పోవుచుండును)

పురోహితుడు:- (వేమనను గాంచి) ఒరే! పిచ్చివాడు వచ్చుచున్నాడు. బురదనీటితో వచ్చుచున్నాడు. మన మీాద చల్లునేమో, తొలగండి తొలగండి. (అనుచు దూరముగా తొలగును. ఆలయములోని అందరు తొలగి చూచుచుందురు)

వేమన:- (పై పద్యమును చదువుచు తాను తెచ్చిన బురదనీటిని విగ్రహముపై వదలును. రాయిగావున్న విగ్రహము బంగారు రూపముగా మారును. దేవాలయములో ధ్వనికలుగును. అచ్చట నున్నవారందరు భయకంపితులై, ఆశ్చర్యమానసులగుదురు. వేమన అదృశ్యుడగును)

అనవేమన:- పురోహితులారా! యిది ఏమి అద్భుతము. యిట్టి మహిమ గలవాడు ఏడి చూడండి. యిప్పుడేకదా యిచ్చటికి వచ్చినది. అప్పుడే వెళ్ళెనా. అతని వైఖరిచూడ నా సోదరునివలె నున్నాడు. నిజముగా నాసోదరుడే. (ముందుకువచ్చి ప్రజలనుగాంచి) ప్రజలారా! యితడే మన చినబాబు. యీ జనసమూహములో ఎటు వెళ్ళెనో వానినిగాంచి పట్టుకొనండి. (అని కేకలువేయుచు) హా సోదరా!

అదుగో నా సోదరుడు వెళ్ళుచున్నాడు. బాబు, వచ్చుచున్నాను వుండుము. (ఎదుటగాంచి, నిస్సహాయుడై గాంచక) యింకెక్కడి సోదరుడు, సోదరా, సోదరా, (అనుచు మూర్ఛిల్లును)

సూరమాంబ:- బాబు, బాబు, ఏడి, నా బాబు, బాబు, యీ జనసమూహములో లేడె, బాబు, బాబు (అని కేకలువేయుచు అటునిటు గాంచుచు) బాబు, బాబు! (అనుచు మూర్ఛిల్లును).

అన్నపూర్ణ:- చిన్నన్నయ్యా! అన్నయ్య ఏడి? మా అన్నయ్య. ఎచ్చటకు వెళ్ళితివయ్యా! అన్నయ్యా! అన్నయ్యా! అయ్యో! మా చిన్నన్నయ్య దర్శనము ఎన్నాళ్ళకో కదా! (ఏడ్చుచు కేకలు) అన్నయ్యా! అన్నయ్యా! (అని మూర్ఛిల్లును)

ప్రజలు:- (ఒకరి నొకరు డులకించి) ఇదుగోరా! మన బాబు. వీడేరా. (అని తన యెదుటవానిని కౌగిలించుకొనును)

రెండవవాడు:- ఏందిరా! నన్ను పట్టుకొన్నావు.

మొదటివాడు:- నీవటరా! మన చినబాబు అని.

మూడవవాడు:- అదుగోరా! అటువైపుకు వెళ్ళుచున్నాడు. పట్టుకో, పట్టుకో. (అనుచు పరుగెత్తుచు ఒక గోతిలో పడును. లేచి) అబ్బ కాళ్లు విరిగినవి నే నడువలేకున్నాను. బాధ. బాధ. (అని బాధ నభినయించును)

(అనవేమనకు పురోహితులును, అన్నపూర్ణ, సూరమాంబలకు దాసీలు వుపచారములు చేయగా మూర్ఛనుండి లేచి)

అనవేమన:- పురోహితులారా! నా సోదరుడు నాకు కనుపించునా? యిచ్చటికి వచ్చినవానిని గ్రహించలేకపోతిమి కదా!

సూరమాంబ:- బాబు! బాబు! మమ్ములను దుఃఖ సాగరమున ముంచితివా! (అనుచు భర్తనుగాంచి) హా నాథా! యిచ్చటకు వచ్చినవానిని గ్రహించలేక పోతిమి కదా! యింకెక్కడి బాబు. వాని దర్శనము ఎన్నాళ్లకో కదా! (అని దుఃఖించును)

అన్నపూర్ణ:- (దుఃఖముతో) చిన్నన్నయ్యా! చిన్నన్నయా! నీ సోదరి మొర వినవా, నీ దర్శనమియ్యవా, (అనుచు ఎదుట అనవేమనను

సూరమాంబను గాంచి) పెద్దన్నయ్యా! అన్నయ్య ఏడి. మీాకు కనబడినాడా ?

అనవేమన:- లేదు. సోదరీ యీా జనసమూహములో ఎచ్చటను లేదు. వాని మహిమవలన మనకు అంధత్వము కలిగి మనబాబును గాంచలేక పోతిమి. అమ్మా సోదరీ యిచ్చటిపూజలు అయినవి. మీారిక దాసీలతో అంతఃపురమునకు వెళ్లండి. నేనును వచ్చెదను. మనబాబును వెదుక సేవకులను బంపి వచ్చెదను.

అన్నపూర్ణ:- సరే! అలాగే! పంపుము. అన్నయ్యా! (అని వదినను గాంచి) అమ్మా! వెళ్లుదమా.

సూరమాంబ:- (విచారములో) వెళ్లుదము. (అని నిష్క్రమింతురు)

అనవేమన:- (మంత్రినిగాంచి) మంత్రిపుంగవా! మాా బాబును వెదుక సేవకులను బంపుము.

మంత్రి:- ప్రభూ! పంపెదను. (అని నిష్క్రమించును.)

పురోహితుడు:- ప్రభూ! దేవతా సంభూతుడైనట్టి వానినిగూర్చి తమకీ విచారమేల? అతడు దేవాంశ సంభూతుడుకాని మానవమాత్రుడు కాడు.

అనవేమన:- నిజము భూసురోత్తమా! కాకున్న క్షణములో యట్టి మహిమ జూపునా. (పురప్రజలను గాంచి) ప్రజలారా! మీారు భక్తితో యీా దేవాలయములోని దేవుని నారాధించుకొనుచు కాలమును గడపుకొనుచుండుడు. మేమిక వెళ్లుచున్నాము.

పురప్రజలు:- జయ్! అనవేమన రాజుగారికి జై!

(అని జయధ్వనులు గావించుదురు. అవనిక జారును)

(అవనిక నెత్తగా కల్లు, సారాయి అంగడి. త్రాగుబోతులు.)

(రామయ్య, రంగయ్య, త్రాగుడుగాండ్రు. వెంకన్న అంగడిదారుడు.)

రామయ్య:- (గ్లాసు చేతపట్టుకొని) వెంకన్నబావా! పోయ్యి. వక ముంత పోయోయ్!

వెంకన్న:- రామయ్యా! నీకు శానా బాకి వుంది. నేను పొయ్యను. వెనకటి బాకి యిచ్చై. పోత్తా.

రంగయ్య:- ఏందిరా! రామయ్యా! యిక్కడ ఎందుకు బాకీ చేసావురా యిచ్చై. యెదవ బాకీ. యెదవ డబ్బులు. యెదవ నాయాల.

రామయ్య:- ఏంజెయ్యనురా, రంగయ్య! యియ్యాల యింట్లో మానెడు నూకలువుంటేను, మీా అమ్మాయిని చూడకుండా తెచ్చి బజారులో అమ్మి తెచ్చానురా యీా రూపాయి! యిది మాత్రమువున్నది. ఆనక సారా లక్షుమ్మకు యిద్దామని దాచారా.

రంగయ్య:- యిడదే ఆ రూపాయి (అని తీసుకొని వెంకన్నకు యిచ్చి) వెంకన్న పొయ్యిముందు. నాకు పొయ్యి. కల్లు ఎట్టావుందో రుచి చూత్తాను.

వెంకన్న:- రంగయ్య! దర్జా అట్టావుండాలె. డబ్బులియ్యాలె; జలసా చెయ్యాలి (అని కల్లుపోయుచుండును)

రంగయ్య:- (త్రాగుచు) అబ్బ! ఎంత రుచిగావుంది. అమరతం అమరతం లాగుంది. రామయ్య నీవుకూడా తాగు. ఎంత తాగుతావో చూత్తాను. వెంకన్నబావా! వాడికికూడా పొయ్యి, వాడి డబ్బులు నే నిత్తాలె.

వెంకన్న:- సరే! నీదగ్గరే వసూలుచేత్తా (అంటూా రామయ్యకు కూడా కల్లుపోయును)

(రామయ్య, రంగయ్యలు తప్పత్రాగుదురు)

రామయ్య:- సరె రంగయ్య! నాకు మత్తుగావుందిరా. వెళ్దాం రారా (అని లేవబోయి పడును)

రంగయ్య:- ఓరి యెదవనాగన్నా! ఏందిరాఅది! పడ్తావేంరా! లె! లే! (అని ఒకరికొకరి చేతులు పట్టుకొని వీధిలోకివచ్చి ఎదుటగాంచి వారలకు ఇతరులు అడ్డమువచ్చినట్లుగా నటించి)

రంగయ్య:- ఏ! ఎవడురా వాడు. నాకు ఎదురు వత్తున్నాడు. దొక్క చీలుత్తా! ఏ! తంతాను. జాగరతగా బతుకు.

రామయ్య:- (తూలుచు) ఎవడురా వాడు. ఏయ్ నేను రాముడను. రాముడంటే జగదపి రాముడు, లోకాపి రాముడురా! ఎవరైనా

అడ్డమువత్తె ఖూనీ చేత్తా! జాగ్రత్త (అనుచు పడబోవుచు) వరే రంగయ్యా! పోదాం పదరా.

రంగయ్య:- రారా! పోదాం. (అనుచు ఒకరికొకరు చేతులు పట్టుకొని పోవుచుందురు.)

వేమన:- (వీధిలో ప్రవేశించి త్రాగుబోతులను గాంచి) ఏమి! వీరి మూఢత్వము. తప్ప త్రాగి మంచి చెడుగులను గమనించక, పరువు మర్యాదలను వీడి గరాణులవలె వీధినిపోవు వారలం గని తారతమ్యము లెరుంగకుండా దూషించుచు పోవుచున్నారు. సదా దుర్వ్యసనములకు లోనై తుదకు భార్యా బిడ్డలు కూటి కొరకు ఏడ్చుచుండ కఠినాత్ములై వారల మొర వినకుండా యీ విధముగా త్రాగి పామరులై తిరిగి తుదకు అధోగతి పాలగుదురు కదా! (ప్రకాశముగా)

సీ. కల్లు సారాయిని కడుప్రేమతో ద్రాగి
మత్తులై దిరిగెడి మూఢులార!
గంజాయి ప్రేమతో కడు మత్తుగా బీల్చి
మంగలై దిరిగెడి యోగులార!
క్రూరులై యే ప్రొద్దు గ్రుమ్మరి ప్రజలను
హింసలు జేసెడి హీనులార!
పరమాత్మ నెరుగక పర భామలకు వెంట
పామరులై దిరుగు పశువులార!

గీ. పరువు మర్యాదలను వీడి ప్రాకులాడ
అన్ని కష్టంబులను అనుభవింప కెపుడు
నమ్ముడీ నాదు వాక్యముల్ ప్రియము మీర
స్వానుభవమున జెప్పుచున్నాను వినుడీ.

రంగయ్య:- (చెవియొగ్గి విని) వరే రామయ్యా! హెూడోసూద్రా అబ్బ ఎటువంటిపద్యెం చెప్పాడురా! సక్కగా మనంటి తాగుడు కలవాటుపడిన యెర్రోల్లకీ బుద్ధి వచ్చునట్టు చెప్పాడురా! (చూచి)

ఏదో మల్లా సెప్పబోవుసున్నాడు. యిందము. ఆయనవద్దకి వెళ్ల దాం పద (అనుచు యిద్దరు వేమనదగ్గరకు వచ్చుదురు)

వేమన:- (తాగుబోతులనుగాంచి) పామరులార! మన మానవజాతికి భగవన్నామము కంటె ముక్తిమార్గమును గాంచుటకు వేరే సాధన మింకేమియును లేదు. కావున కష్టపడి సంసారములను గడుపు కొనుచు భగవన్నామ సంకీర్తనము గావించుకొను చున్నచో అదియే మోక్షమార్గమునకు సోపానము వంటిది.

(రామయ్య రంగయ్యలు యిద్దరున్ను వేమన పాదముల పైబడి)

రామయ్య:- సామి! యివె పదేల నంస్కారాలు. మీరొక మహాత్ములు వలె గనబడుచున్నారు. తంరుపల్కిన వాక్కములు మాకెంతయో ఆనందము గలిగించినై. మాకు మీ బోదవల్ల తెలిచింది. మీ పాదాలుసాచ్చిగా నేటినుండి యీ దుర్వ్యసనం వదిలి ఆ భగవంతుని నారాధించుచు, పూజించుచు, తంరని ఒక గురువుగా బావించు కొని కట్టబడి సంసారాలు గడుపుచు ముత్తి మారగము గాంచె దముసామి.

వేమన:- (వారలలేవనెత్తి) అట్లే గావించుకొనుడు. సజ్జన సహవాసము సజ్జనహితమును, గలిగినయడల త్వరలో ముక్తిమార్గమును గాంచ వచ్చును. నాకనుష్ఠాన కాలమైనది. నేనువెళ్లుచుంటిని. మీరిక వెళ్లిరండు.

రంగయ్య:- ఆలాగ సామి, తంరుండె దెక్కడండీ. మరొకసారి తమ దర్శనము జేసికొనుటకు.

వేమన:- నా నివాసస్థానమా! ఒక్కచోట అననేల అన్నిచోట్లను వుందును. మీరు ఎప్పుడు సద్భక్తిగలిగి, నా దర్శనము గోరుదురో అప్పుడే నా దర్శనము గల్గును. వెళ్ళిరండు. నేను వెళ్ళుచుంటిని.

(అని నిష్క్రమించును. అందరు నిష్క్రమణ, అవనిక జారును)

(అవనిక నెత్తగా రాజాంతఃపురభాగము
అనవేమన, మంత్రి, సేవకుడు వుండును)

అనవేమనః- మంత్రిపుంగవా! మన సాగుచేయు పొలములో విత్తనాలు చల్లుట అయినదా? నీవు అచ్చటకు వెళ్ళివచ్చితివా?

మంత్రిః- చిత్తము. వెళ్ళివచ్చితిని. అచ్చట మన సేద్యకాండ్రను విచారించితిని. జొన్న, వరిగ, సజ్జ విత్తనాలు చల్లితిమని చెప్పిరి. యింకను కాశిభోగాలు, రత్నభోగాలు, పొగడాలును, యీ విత్తనాలు చల్లవలెనట ప్రభూ!

అనవేమనః- సరే యివాళ్ళ పొలమును చూడబోవుదము. పల్లకి మోయు బోయీలను సిద్ధముగావింపుము.

మంత్రిః- అలాగే పిలిపించెదను శలవు.

(అని నిష్క్రమించును. అవనిక జారును)

శ్రీ వల్లుట గోత్రోద్భవ లంకిరెడ్డి సకలారెడ్డి పౌత్ర కోటిరెడ్డి పుత్ర
వెంకటసుబ్బారెడ్డిచే శ్రీ ఉమామహేశ్వరస్వామి వార్ల
కృపాకటాక్ష వీక్షణములచే వ్రాయబడిన
శ్రీ వేమన మాహాత్మ్య మను నాటకమునందలి
చతుర్థాంకము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

---

# శ్రీ వేమన మాహాత్మ్యము

అను

# నాటకము

## పంచమాంకము

(అవనిక నెత్తగా పట్టణపు వీధి)

వేమన:- (ప్రవేశించి ఎదుట గాంచి) ఓహో! ఏమి యీ జన సమూహము. పల్లకీ గలిగి ఎడ్లను నాగళ్లకు కట్టి విత్తుల మూటలతో నేగుచున్నారు. (యోజించి) తెలిసినది. యీ సేవకులు పొలములో విత్తులు చల్లుటకు వేడుకతో మా అన్నగారిని కూడ వెంటబెట్టుకొని వెళ్లుచున్నారు. ఆయన ఆ ప్రయత్నమునకు వెళ్ళిన, నేనును నా ప్రయత్నమును జేసెదను. నాకును గలదు గదా! ఆ వాగు వద్దున యిసుకమేట పొలము. దానిలో పిచ్చిపుచ్చ విత్తనాలు నేనును చల్లెదను. యిప్పుడే కోటేరు పన్ని, ఎడ్లను కట్టి తోలెదను గాక.

సీ. కామక్రోధంబుల కాడి ఎడ్లుగ జేసి
  కదురయంబున నేగు కర్షకుండు
మోహ లోభంబుల మోదంబునను బట్టి
  మేడి నాగలిజేసి మహినిబెట్టి
మదమత్సరములను మోకువార్నెగ జేసి
  బుద్ధి యనెడు దాన పగ్గమేసి
గురుమంత్ర మహిమచే గుణము లన్నిటి బట్టి
  కోటేరు గట్టియు కర్షకుండు
గీ. వెడలె యీ వేళ విత్తుల గంపతోను
వేగ చల్లియు పొలమును వేగదున్ని
పంట పండించి ప్రజలకు భక్తిజూపి
ముక్తిమార్గంబు జూపెద ముందు నేను.

యిదె వెళ్ళెదగాక! (అని వీధిప్రక్కన పారవేయబడిన ఒక పాత గంపను తీసి నెత్తిపై నిడికొని ములకాల కర్రను చేబట్టి ఎడ్లను అదలించునట్లు నటించి నిష్క్రమించును. అవనిక జారును)

(అవనిక నెత్తగా అంతఃపురభాగము)

(అనవేమన, సూరమాంబ, అన్నపూర్ణ, దాసీలు వుందురు)

అనవేమన:- దేవీ! మన అమ్మాయిని అత్తవారి గృహామునకు తీసు కెళ్తామని మనకు జాబువ్రాసియుండిరి. యిదిగో యిటు వినుము.

చం. వినుమిదె యింతిరో మనకు జాబునువ్రాసిరి వేగ పట్టినిన్
వేడుకతోను పంపమని అత్తయు మామయు వ్రాసినారు
యీ పట్టిని వేగ పయనమునుజేయుము వేడుకతోను యింతిరో
యెంతయు ఖ్యాతిగా నటకు వేగమ పంపగజేయు మిప్పుడున్.

సూరమాంబ:- ఆలాగె. ప్రయాణముజేసెదను. నాధా! మన బాబు యిటువంటి వేడుకసమయమున వుండిన ఎంత సంతోషముగా నుండెడివాడో కదా! ఆయన ముచ్చటలు కూడా జూచుకొని ఆనందించు భాగ్యము లేకపోయెను కదా నాధా! (అని విచార పడును)

అనవేమన:- ఏమిచేయుదము. మనఖర్మ. ఎక్కడవుంటు వున్నాడో కాని ఎవరిని పంపినను వానిజాడ కనలేక పోవుచుండిరి. నాకు మాత్రము విచారములేదా! దేవీ!

అన్నపూర్ణ:- (ప్రవేశించి) పెద్దన్నయ్యా! చిన్నన్నయ్య ఎచ్చట వుంటూవున్నది నేను తెలుసుకొనివస్తాను. తప్పకుండా నాకు దర్శన మిస్తాడు. నాకుశలవు.

అనవేమన:- సోదరీ! మేము వానిజాడ కనలేకపోతిమి. నీ వెచ్చట గాంచగలవు. అమ్మా! అయిన నీ కోరిక కాదననేల. యీ దాసీని వెంటనిడుకొని వెళ్లిరమ్మా.

అన్నపూర్ణ:- సరియె అన్నయ్యా! ఆలాగెవెళ్లెదము.

(అని దాసీ వెంటరాగ నిష్క్రమించును.) (అవనికజారును)

(అవనిక నెత్తగా దేవాలయపువీధి)

వేమన:- (రోడ్డుప్రక్కనున్న గుంటలోవున్న నీటిలో స్నానము చేయుచు తనలో) ఆహా! ఏమి యీ ప్రపంచముయొక్క మహిమ యెన్నియో దత్వవిచారములు నామనంబున గల్గుచున్నవి గదా! (ఎదుటగాంచి) ఆ వచ్చునదెవరు. (మరలచూచి) మా సోదరి అన్నపూర్ణవలె నున్నది. (మరలగాంచి) మాసోదరియే చెలి కత్తెతో వచ్చుచున్నది. ఏదియో విశేషముండవచ్చును. (అనుకొని స్నానము చేయునట్లు నటించుచుండును)

అన్నపూర్ణ:- (వేమనను గాంచి) చెలి! అడుగో మా అన్నయ్య. అచ్చట స్నానము చేయుచున్నాడు చూడుము. మా అన్నగారి దర్శనము గాంచితిని. చాలా సంతోషము. వెళ్ళుదము రమ్మా. (తొందరగా వచ్చి) అన్నయ్యా! నమస్కారము.

(అని నమస్కరించును)

వేమన:- (అన్నపూర్ణను గాంచి) సోదరీ! దీర్ఘసుమంగళివై యుందువు గాక! అమ్మా! ఏల కష్టపడి యిట్లు రాగలందులకు గల కారణము. ఎరింగింపుము.

అన్నపూర్ణ:- అన్నయ్యా! యిట్లు సర్వమును సన్యసించి మాకు దుఃఖమును గలిగించి సర్వసంగ పరిత్యాగివై సంచారము చేయుచున్న నీ దర్శనము గాంచ వచ్చితిని అన్నయ్యా! యిటు వంటరివై

సీ. పశిడి మేడలలోన వసియించు ప్రభునకా
కట కటా వీధిలో వసతి నీకు

వేమన:- (ఆశ్చర్యముతో) ఆఁ! ఏమనుచున్నావమ్మా! మేడలని పల్కుచుంటివా.

తలలు జడలు గట్టి తప మొనర్చుచు నున్న
జడదారులకు లేవె సౌధములును

అన్నపూర్ణ:- అన్నయ్యా! అదియా నీ తలంపు.

పట్టు పరుపులపైని పవళించువాని కా
బండ రా నేలపై పాన్పువసతి

వేమన:- యేవేళ్ళ దీక్షతో నున్నట్టివారి కీ
బెడ్డనేలయు గాళ పాన్పులేల

అన్నపూర్ణ:- పూలవనమ్ములం బ్రొద్దుపుచ్చెడి నీవు
వీధిలో కాలంబు గడుపనయ్యె

వేమన:- పుండరీకాక్షుని భజనంబుచేయుచు
కాలంబు గడిపెద పుణ్యశీల

అన్నపూర్ణ:- యే ప్రొద్దు యువకులు వెంటరా నడునంగ
నొంటివై నీ విట్లు నడువనేల

వేమన:- యే ప్రొద్దు శ్రీహరి స్మరణచేయుచు నడువ
యువకులు ఏలను యబల నాకు

అన్నపూర్ణ:- గీ. అన్న ! నా మాట వినుమన్న ! అన్న నీవు
యిట్లు దిరుగుట నీకిపుడు యేమి సుఖము
లేదు, సుఖమించుకైనను లేదు నిజము
రమ్ము గృహముకు పోదము రమ్ము! రమ్ము!

వేమన:- గీ. అమ్మ గృహముకు రానమ్మ అమ్మనీవు
తెలియకున్నావు నీవింక ధరణియందు
కష్టపడకున్న ఫలమును గాంచబోరు
అమ్మ యిటు లన జెల్లునే అన్నపూర్ణ.

సోదరీ ! కావున యిట్టి హితమును వీడి నీ వచ్చిన కారణం బెరింగింపుము.

అన్నపూర్ణ:- అన్నయ్యా! నీయట్టివానికి హితమును చేయుదాననా. అన్నయ్యా ! నన్ను అత్తవారి గృహంబునకు అంపుటకు పెద్దఅన్నయ్య, వదినెగార్లు ప్రయాణ సన్నాహములు గావించు చున్నారు. కావున తల్లిదండ్రులు లేనప్పటికి తోబుట్టవులరగు మీరు యిద్దరును వేడుకగా వెంటరా ప్రయాణముచేసి నన్నంప గలరని వేడుకొను చున్నదానను అన్నయ్యా !

**వేమన:-** సోదరీ! నీవట్టి విచార మందనక్కరలేదమ్మా. వేలయన ఒక్క మహనీయుని కృపాకటాక్ష వీక్షణములచే నాకు జ్ఞానోదయంబై, జ్ఞానశక్తి అను తేజస్సు నాలో ఆవహించి మాయాంధకారమను చీకటిని బోగొట్టి సర్వమును మిధ్యయని తలంచుచున్నవానిని నీవక మహనీయుడని తలంపక సామాన్యునివలె తలంచు చుంటివా! తల్లీ అట్లే యగుగాక! ఏది, నీవు అత్తగారి గృహంబుకు అరుగుచుంటినని గదా! పలికితివి. ఏదో చిన్నన్నయ్య వద్దకు గూడ వెళ్లిన ఆయనకూడ ఏమైన యిస్తాడుగదా! అని కొండంతయాసతో నాజాడనరయుచు యిటకు వచ్చితివి. అమ్మా! నీ కోరిక తీర్చెదను. పెద్దన్నయ్యకువలె గృహస్థాశ్రమమునుండి సకలాభరణములను యిచ్చినట్లు నేను యివ్వలేకున్నను నాకున్న భాగ్యము నీకొసంగెదను. తల్లీ! నీచీరెకొంగు పట్టుము.

**అన్నపూర్ణ:-** (తనలో) యీయన నీటిలో కూర్చుని వున్నాడు గదా! యిచ్చట ఏమి గలదు. నాకిచ్చుటకు.

(అని సందేహించుచు చీరె కొంగు పట్టును)

**వేమన:-** (తాను కూర్చున్నచోట బురదతోకూడిన నీటిని మూడు దోసిళ్లు వేయును) సోదరీ! యిక వెళ్లిరమ్మా.

**అన్నపూర్ణ:-** (తనలో యేవగించుకొనుచు) (ప్రకాశముగా) ఆలాగె అన్నయ్యా!

**వేమన:-** సోదరీ! యింకొక విషయము యిటు వినుము.

సీ. పతియె దైవంబని సతతంబు భక్తితో
పూజించుకొనవమ్మ పుణ్యశీల
అనవరతంబు నీ అత్త మామల యాజ్ఞ [illegible]
కెదురాడ బోకుమా కన్నతల్లి
ఆకులలోపల బిందె రీతిగ నెపుడు
అడవకువతో నీవు మెలగుమమ్మ
యే వేళ నయినను యెవ్వరేమన్నను
యెదురాడ బోకుమా ఈసుతోడ

గీ. యిట్టి బుద్ధులు గలిగియు, యెపుడు నీవు
పతిని పూజించి భక్తితో ప్రబలుమమ్మ
పతియె సతికెపుడు గతియని తలచుమమ్మ
వెడలి రాగదవమ్మ యో వెర్రి తల్లి.

అన్నపూర్ణ:- అన్నయ్యా! వెళ్లి వచ్చెదను శెలవు. (అని యీవలకు వచ్చి చెలికత్తెకు జూపి) చెలి! మా అన్నగారి అజ్ఞానము చూడు. నాకున్న భాగ్యము నీ కొసంగెదను. నీ చీరకొంగు పట్టుము అనుటతోడనే ఆసతో చీరకొంగు పట్టితిని. యింత బురద నీటిని పడవేసినాడు. యీ పట్టుచీరె మాసిపోయినది. ఎందుకు యీ బురదమట్టి. ఎవరైన చూచిన నవ్వుదురు. యిచ్చట పారవేయుదును. (అని కొంగు చాచి పారవేయబోవ అందు బంగారు కళికలు మూడు మెరయుచుండును. అంతట యిరువురు ఆశ్చర్యమానను లగుదురు) చెలీ! ఆశ్చర్యము. యీ పశిమి ముద్దలు ఎచ్చటినుండి వచ్చినవి. చిత్రము! చిత్రము! మా అన్న గారి మహిమవలననే గలిగినవి. ఆయనను అజ్ఞానుడని దూషణ జేసితిని. ఆయన గాదు. నేను అజ్ఞానవతిని.

గీ. ఔర! అలనాడు విగ్రహ ప్రతిష్ఠనాడు
బురదనీటిని ప్రోక్షించి పశిమి జూపె
యిపుడు వీనిదర్శన మరయఁగా గోరిరాగ
వీని మహిమంబు నా కిపుడు జూపె నహహా!

చెలీ! నీవు అంతఃపురమునకు వెళ్ళుము. యిట్టి మహిమతో పరమాత్మస్వరూపుడువలె మా అన్నగారుండ యీ ప్రపంచముతో నా కేల. మరల ఆయన దర్శనమున కేగి ఆయననే వేడుకొని ఆయన పాదసేవ జేసికొనుచు ఆయనకడనే కాలమును వెళ్లబుచ్చెదను. వెళ్ళుము. యిదే నే వెళ్ళుచుంటిని. (అని పోవుచుండ)

చెలికత్తె:- (అడ్డమువచ్చి) అమ్మా! అన్నపూర్ణావతి! ఎంత బేలవమ్మా! యిదివరకె చినబాబు ఆ తీరు అయ్యెనని పెద్దన్నయ్య,

వదెనగారు ఎంతయో విచారపడుచుండ యిప్పుడు నీవుకూడ ఆ తీరువైతివా యిక చెప్పనక్కరలేదు. వారిగతి అధోగతి. ఎందుకు తల్లీ వెళ్ళుదాము రమ్మా.

అన్నపూర్ణ:- (యోజించి) చెలీ! నీ మాట తోసివేయుటయేల. సరే అంతఃపురమునకు ఆలాగె వెళ్ళుదము. కాని యిట్టి మహాత్ముడైన మా అన్నగారి దర్శనము ఎన్నాళ్ళకో గాంచుట. మరల ఆయన కడకేగి దర్శనముచేసికొని వచ్చెదను. నీ విచ్చటనే వుండుము.

చెలకత్తె:- అలాగె యిచ్చటనేవుందును. నీవువెళ్ళి త్వరగా రమ్మా.

అన్నపూర్ణ:- త్వరగానె వచ్చెదను (అని నిష్క్రమించును)

వేమన:- (ఎదుట గాంచి) అదిగో మా సోదరి మరల తిరిగి వచ్చుచున్నది. ఏ విషయము గోరదలంచినదో. అయిన యీమె భక్తి పరయుటకు యిదే సమయము. నే నిచ్చటనే అదృశ్య రూపముతో నుండెదను. (అదృశ్యముగా నుండును)

అన్నపూర్ణ:- (ప్రవేశించి) మా అన్నగారు వున్నది యిచ్చటనే గదా! లేరే! ఎక్కడకు వెళ్ళినారో. ఎచ్చటికైనా వెళ్లెనేమో పిలిచెద గాక!

ఉ. అన్నా! ఎచ్చట కేగినావో కద యిచ్చట నుంటివిగాదె
యింతలో సోదరి గోరగా మరల వచ్చునటంచును చోద్యమంది
నీ వెక్కడ దాగితీవు యిక బయల్పడి నా దగు శోక మార్పుమో
అన్నయ నీదు దర్శనము గోరగ వచ్చితి వేగ బ్రోవుమా!

వేమన:- (బయల్పడి) సోదరీ! నా మహిమను గనుంగొన్న నీ భక్తికి నే నెంతయు సంతసించితిని. ఎందుకమ్మా! నీ కింత విచారము. నే నెచ్చటకి వెళ్లలేదు తల్లీ! యిచ్చటనే వుంటిని. ఏదీ నీ మనంబున ఎట్టి విషయము జ్ఞప్తికి రాగా మరల వచ్చితివో ఆ విషయమును విశదీకరింపుము.

అన్నపూర్ణ:- అన్నయ్యా! సర్వమును మిథ్యయని పల్కితివి కదా నాకేమియు అక్కరలేదు. సతతము నీ దర్శన భాగ్యమే కావలయునని వేడుకొనుచున్న దానను

వేమన:- అమ్మా! అదియె దుర్లభము. ఏమన నీ భక్తి ప్రేమలచే కోరితివి కాని అది మరల నాకు గృహస్థాశ్రమ ధర్మములకు మార్గము. సోదరీ! మనము ఏకగర్భస్థులమగుటచేతను నీకు నాయందుండు భక్తి ప్రేమలచేతనున్న నీకు వక్కసారి నాదర్శనము కలుగును. సోదరీ అదియేనీకు నాకడసారి దర్శనము. దానికై నిరీక్షించు చుండుము. అమ్మా! నాకనుష్టానకాలమైనది. నీవిక వెళ్ళిరమ్మా.

అన్నపూర్ణ:- అలాగె అన్నయ్యా! నమస్కారము. (అని నమస్కరించును)

వేమన:- ఆయుష్మాన్ భవ అమ్మా! నీ వెప్పుడును దీర్ఘసుమంగలివి: వెళ్ళిరమ్మా.

(అన్నపూర్ణ నిష్క్రమించును అవనికజారును)

(అవనికనెత్తగా వీధి)

అన్నపూర్ణ:- (ప్రవేశించి చెలికత్తెనుగాంచి) చెలీ! మరల వెళ్ళిన ఆయనదర్శన ప్రాప్తికలిగినది. సంతోషానందములో సంభాషించి నమస్కరించి వచ్చితిని. అంతఃపురమునకు వెళ్ళుదమా!

చెలికత్తె:- అలాగె తల్లి! వెళ్ళుదము రమ్మా.

(అని యిరువురును నిష్క్రమింతురు. అవనిక జారును)

(అవనిక నెత్తగా అంతఃపురభాగము. అనవేమన, మంత్రి, వుందురు)

అనవేమన:- సచివరా! మన షారములోని పొలము వంటపండి కోతకు వచ్చినది కాబోలును. కావున

గీ. పంటపండిన పొలమును ప్రజలచేత
కోతకోయించి వారికి కూలియిచ్చి
కుప్పలును వేసి కొట్టించి ధాన్యమంత
కొట్లులకు నింపుమో మంత్రివర్య నేడు.

మన నగరమందువున్న కూలిజనులకు పనులు కల్పించండి. వారికి కబురుచేయుము. వెళ్ళి సేవకులను పంపి వారికి పనులుకల్పించుము.

మంత్రి:- అలాగె ప్రభూ! (అని నిష్క్రమించును. అవనిక జారును)

(అవనిక నెత్తగా నగరవీధి)

వేమన:- (ప్రవేశించి) ఆహా ! ఏమి మానవస్వభావము ప్రతివ్యక్తియును కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరంబులనెడి యీ షడ్వర్గంబులతోనె కాలముగడుపుచుండును. కాని తాను వెడలి వచ్చిన విషయమేమిటో యోజించుకొనరు గదా !

ఆ. వె. దార సుతాదులు తనవారె యని నమ్మి
తరలిపోవునాడు దలచ రెవరు
తలచ యిందుదేహి తనవారు యెవరయా
విశ్వదాభిరామ వినురవేమ.

యిదియంతయు భ్రమ – కాకున్న

తే. గీ. ఒకడు చచ్చు యిలను ఒకడు పుట్టుచునుండు
యెరిగియుండి వెర్రియేల భ్రమలు
నేగువేళ వెంట నేమైన గొనిపోయె
విశ్వదాభిరామ వినురవేమ.

ఓహో ! యీ తత్వవిచారములోనె వుంటిని. కాలము గడచినది. నేను చల్లిన పిచ్చి పుచ్చవిత్తనములు మొలచి, పైరు పెరిగి పంట బాగా ఫలించినది. కాయలు పండి పక్వమునకు వచ్చినవి. యీ కాయలమహిమను గ్రహించుటకున్ను, యీ కాయలను కోయుట కున్ను, ఎవరైన కూలిమనుష్యులు దొరుకుదురేమో (ఎదుట గాంచి) ఎవరో అటువేపు జనులు గుంపుగా పోవుచున్నారు. వార లను అడిగెదను గాక (అనుకొనుచుండును)

(కూలీలు వీధిని పోవుచుందురు)

వేమన:- (కూలీలను గాంచి) కూలీలులారా !

తే. గీ. ఎచ్చటికి నేగుచుంటిరి మీరలిప్డు
హెచ్చుకూలిని యిచ్చెద మీకు నేను
పుచ్చకాయల కోసియు రాసిపోయ
రండు నావెంట యిప్పుడు పనియు గలదు.

కూలివాడు:- ఎక్కడయ్యా! కాయలను కోయుట. దూరమా దగ్గిరా.

వేమన:- దగ్గిరే. ఆ కనపడుచున్న వాగువద్దు నున్న యిసుక మేట పొలమే.

రెండవవాడు:- సరె. కూలి ఏమిత్తావు. డబ్బా! గింజలా.

వేమన:- మీరు ప్రతిదినము కూలికి పోవుచుంటిరి కదా! ఏమి తెచ్చుకొనుచున్నారు?

మొదటివాడు:- మేము ప్రొద్దుకూకిందాక పని జేత్తాము. వచ్చేటప్పుడు మనిసి ఒక్కంటికి మోపు పంటసొప్ప తెచ్చుకొంటాము.

వేమన:- సరె. వారి కున్నది వారు యిచ్చుచున్నారు. నా కున్నది నే నిచ్చుకుంటాను.

మొదటివాడు:- సరే. చేనికి దారితీయి. మేము నీ యెంట వత్తాము.

వేమన:- రండి. (అని ఒక గంప బట్టుకొని దారిని పోవుచుండగా వెనుక కూలిలును పోవుచుందురు)

(అవనిక జారును. అవనిక నెత్తగా పిచ్చి పుచ్చతోట కాన్పించును.)

(కూలీలు కాయలు కోయుచుందురు, కోసిన కాయలను గంపలో వేసికొని ఒకచోట రాసిగా పోయుచుందురు.)

కూలివాడు:- యేవయ్యా! యీ కాయలకు మార్కెట్టు గిరాకి ఏమైనా వుందా ఏంది?

వేమన:- వున్నదో, లేదో, మీకేమి తెలియును. నిజముచెప్పిన నమ్మరుగదా. సాయంకాలమునకు చూడండి. మనము కోసిన కాయలు ఒక్కటియైన యిచ్చట దొరుకుతుందేమొ. వీటిమహిమను తెలుసుకొనియె తీసుకొని వెళ్లెదరు.

కూలీలు:- సరే! మావేళ్లైనది. పొద్దు గూకొక్కచ్చింది. మాకూలి మాకిద్దువు రావయ్యా!

వేమన:- మీరందరు కాయలరాశివద్దకు రండి, యిచ్చెదను.

మొదటివాడు:- యీ కాయలను యిత్తాడా ఏంట్రా యెందుకు యీ కాయలు ఎంచేద్దాం!

ముసలికూలి:- ఎ ఎ ఏందిరా ! పప పదండిరా! తీసుకుందాము.
(అని రాశివద్దకువచ్చును. తక్కిన కూలీలు వచ్చెదురు)

వేమన:- (కూలీలనుగాంచి వారలబుట్టలలో ఒక్కొక్కరికి ఒక్కొక్క కాయను యిచ్చును)

కూలి:- ఎందుకయ్యా మాకు యీ కాయలు మేము ఏంజేసుకోం పచ్చడికి పనికి రావాయె.

వేమన:- పిచ్చివాడా ఎందుకు పనికిరాదు. యిందు యిష్టపడినవారికి ఫలము యిష్టపడనివారికి చేదుగలిగిన పిచ్చి పుచ్చకాయ మీా యిష్టము. మొదటనే చెప్పితినిగదా ? వారికున్నది వారు యిస్తారు. నాకున్నది నేనును యిస్తాను. అని నాకున్నభాగ్యం నేను యిచ్చుచున్నాను. యిందు తప్పేమున్నది.

కూలీలు:- (అందరు) మాకొద్దు. మాకొద్దయ్యా ! యిత్తే డబ్బులు యియ్యి. లేకపోతె లేదు. మేము వెళ్తాము.

వేమన:- నా వద్ద యింతకన్న వేరే మున్నది. సరే వెళ్ళండి.

కూలీలు:- (దూషించుతూ వెళ్లుచుందురు)

ముసలి కూలి:- నా నా నాయనా యిందు నీ నీ నీ త తప్పు లే లేదయ్యా ! నీ నీ నీ చేతితో తో యి యిచ్చిన కాయ చా చాలును నా నా నా కూలి కా కా కాయ నా నా కియ్యి.

వేమన:- (నవ్వుచు సంతోషముతో) అవ్వా ! నీ భక్తికి నే నెంతయో సంతసించితిని. యిదిగో ఫలము గైకొనుము.
(అని ఒక కాయను యిచ్చును)

ముసలికూలి:- (కాయను పుచ్చుకొని కనుల కద్దుకొని) నా నాయనా! నె నె మెల్తాను చలవు.

వేమన:- సరే. వెళ్లు అవ్వా!

ముసలికూలి:- (తక్కిన వారితో కలసి వారలతో) ఎ ఎ ఎందుకురా. ఆ ఆ ఆయనను తిట్టటం. ఆ ఆ ఆయన చే చే చేత్తో యి యి యిచ్చిన కాయలో ఏ ఏ ఏముందో ఎ ఎ ఎవరికి తెలుసుద్దిరా.

1 కూలివాడు:- అవ్వా! ఆ కాయలో ఏముందో పగలగొట్టు చూద్దాం.

ముసలికూలి:- ఏ ఏ ఏందిరా! పగులగొట్ట మ మ మంటావా యిదిగో వ వ పగులగొడుత్తా (అని కాయను పగులగొట్టగా కాయలోనుండి చిన్నచిన్న కణికెలుగా బంగారము క్రిందపడును. యీ చిత్రమును కూలీలు అందరు చూచి ఒకరివంక ఒకరు చూచుచుకొని)

1 వాడు:- ఏం అవ్వా! నీ అదుట్టం ఘే మెంత పిచ్చోళ్లం మేము ఆడనే పారెత్తిం. నీవు తెచ్చుకొంటివి. నీకు బంగారము దొరికె. మాకేమి లేకపోయె.

2 వాడు:- వరె యిన్నిమాటలు ఎందుకురా! యిప్పుడు మనమెల్లి తెచ్చుకుందాం రారాదురా.

ముసలికూలి:- వ వ వద్రె అబ్బాయి! ఆ ఆ ఆయన యిత్తె తె తె తెండిరా లె లె లేక పొ పొ పొతె వ వ వద్దురా.

2 వాడు:- ఫో! నీ కేం తెలుసు మేము ఎట్టాగో గట్టా తెత్తాం. పదండిరా (అందరును కలిసి రాశివద్దకు బయలుదేరుదురు)

వేమన:- (కూలీలను గాంచి) అరుగో! కూలీలు మరల వచ్చుచున్నారు. మొదట నేను యిచ్చిన కూలిని పుచ్చుకొనక పారవేసి వెళ్ళి ఆ ముసలిది పట్టుకెళ్ళిన ఫలము మహిమను గాంచి అందరును ఆశచేవచ్చుచున్నారు. వీరువచ్చి యిచ్చట ఏమిచేయుదురో నేను రహస్యముగావుండి చూచెద. (అని అదృశ్యముగా వుండును)

(కూలీలు పెద్ద పెద్ద గంపలతో రాశికడకు పోవుదురు. వేమన రాశివద్ద లేకపోవుట గాంచి)

1 కూలి:- లేడే! ఎక్కడకి వెళ్ళాడో.

2 కూలి:- ఎక్కడికి యెల్తె మన కేం భయమా! మన కట్టం మనం తీసుకొంటానికి. ఒకరెందుకు. మనం అంతా యెనక్కి వత్తుండాలికి మనని సూచి కొడతారని భయం పుట్టి ఎటో పారిపోయాడు కామాసు. సూత్తారేం ఎత్తండి. ఎవరి యిట్టం వాల్లది. (అనుచు తాను తెచ్చిన గంపనిండా కాయలను ఎత్తుకొని ఆయాసములో)

అబ్బ. నాకు చాల్లెరా, నేను పోతుండా. (అని గంపను నెత్తుక పోవును. తక్కిన వారును పోట్లాడు కొనుచు గంపలకు పట్టి ఎత్తుకొని పోవుదురు. రాశి అంతయు మిగులకుండా అయిపోవును)

వేమన:- (అదృశ్యము నుండి వెలువడి నవ్వుకొనుచు రాశిని పరికించి) యిట్టి మూఢాత్ముల కొరకే యీ పిచ్చి పుచ్చతోట వేసినది. యీ కాయల వలన వీరల మూర్ఖత్వము వీడి సన్మార్గము అయినట్టి భక్తి కలుగుగాక! నాకనుష్టాన కాలమైనది. నేను యిచ్చట నుండి వెళ్లెదనుగాక. (అని నిష్క్రమించును. అవనిక జారును)

(అవనిక నెత్తగా కూలీల గృహములు కాన్పించును.)

కూలీలు:- గంపలతో ప్రవేశించి గంపలనుదింపి ఒక్కొక్కరు గంపల లోని కాయలను పగులగొట్టి చూచుచుందురు)

1 కూలి:- (అరె యిన్ని కాయలను చితుకగొట్టి నాఒక్క దాంటోనైనా బంగారములేదె. (అని గంపచూచుకుని) అయిపోయినై. యికలేవు. నాకర్మ! (అని విచారముతో కూర్చుని వుండును)

2 కూలి:- అరి తస్సాదియ్యా! ఎందిది. ఏకాయలోకూడ బంగారము కాత్తన్నాలేదె? (గంపచూచి) గంపలో కాయలన్నీ అయిపోయినై. ఎందుకుంటాది. మాబోటి దరిద్రనాయాల్లకి అకట్ట ముండ బట్టె! ఆ ముసలిముండకు బంగారము కనిపించె. మాకు కనిపించకపోయె! (పైకిజూచి) నిజముగా భగవంతుడే ఆయన కాకపోతే! ఆయన యిచ్చినకాయలో బంగారముంటమేంది.. మేం తెచ్చిన కాయల్లో బంగారం లేకపోటంఏంది. నిజంగా భగవంతుడే! పోతా! అక్కడికెపోతా! ఆయన పాదాలమీద బడతా. నా తప్పు చమించమని ఏడుకొంటా.

ముసలికూల్లి:- ఏ ఏ ఏ ఏజెత్తన్నావురా! యికనన్నా తెలుసుకోండిరా! ఆ ఆ ఆయన భగవంతుడురా!

కూలి:- నిజమే అవ్వా! ఆయన పాదాలమీద పడతాం. మేజేసిన తప్పుకు ఆయనన్నే వేడుకుంటా.

2 కూలివాడు:- రండిరా. మనమంతా పోయి ఆయన ఎక్కడ వుండాడో వెతికి అందరము ఆయన పాదాలపై పడదాం. ఆయనే మనల రక్షించాలి. ఆయనే మనకు దేవుడు రండి. మనమంతా ఆయన భజన చేసుకుంటూ యెల్లదాం.

అందరు ఒకచోట చేరుదురు.

1 కూలివాడు:- చెప్పండిరా! ఆయన్ని తలచుకుంటూ యెల్లాలి.

(అని భజన చేయుచు నిష్క్రమింతురు)

(అందరు భజన చేయుచు కీర్తన పాడుదురు)

ఏ తీరుగ మము దయ జూచెదవో ఎక్కడుంటివి సామీ
మూఢత్వంబున మహిమను దెలియక మోసపోతిమీ సామీ
మాదు తప్పులను మన్నించియు వేగమె దర్శన మియ్యుము సామి
తల్లి దండ్రి గురు దైవము నీవే తప్పక బ్రోవుము సామీ
॥ఏ తీరుగ మము దయ॥

(అందరు పాడుచు వీధిని పోవుచుండగా ఆ వీధి వారలు కొందరు కలసి భక్తితో పాడుచు వారలతో పోవుదురు.)

రాముడు:- (తొందరగా ప్రవేశించి భజనసమూహమును గాంచి) వరే కిట్టమ్మా! మనము ఆయనను ఎవరో అనుకున్నాము. ఎవరో కాదురా. ఆయన మన రాజుగారితమ్ముడు చినబాబుగారట. ఆయన సంగతంతా పెద్దబజారులో మనకువలె జనం గుంపులుగూడి వేమారెడ్డిగారు యోగి అయినాడని చెప్పుకుంటుండగా నేను విన్నానురా. మన చినబాబే నటరా! వీరు ఆయన నామము తలుచుకుంటూ వెళ్ళుదాం.

కిట్టమ్మ:- ఏందిరా! మన చినబాబుగారా! ఎంతమహత్తు! ఎంత మహత్తు! యింకేం కావాలి? మనమందరం భజనజేసుకొంటూ వెల్లి ఆయన పాదాలపై బడదాం. ఆయనవల్ల మనకు ముక్తిమార్గం దొరకాలి. పదండిరా! నేను జెబుతాకాని పాట మీరు అనండి.

ప॥ యేమయ్యా బాబూ! యేమయ్యా
అ॥ నీ మాత్తు దెలియని నిరభాగ్యులము యె ॥యే॥

చ॥ అవ్వ మాటలిని ఆశకు లోబడి
కావరంబునా కలుషుల మైతిమి ॥యే॥
దొడ్డెడు కాయలు దొంగిలి తెస్తిమి
చెడ్డ మనసుచే చెడితిమి సామీ ॥యే॥

వేమన:- (ప్రవేశించి వీరలం గాంచి) వీరలు నేడు నా మహిమను తెలుసుకొని నా దర్శనము కొరకు నా నామముతో భజన చేసుకొనుచు వచ్చుచున్నారు. కానిమ్ము. యింకను వీరల భక్తిని అదృశ్యమున నుండి పరీక్షించెదను గాక.

(అనుకొని వీధిని పోవుచు)

సీ. కాషాయి వస్త్రముల్ ఘనముగ ధరియించి
గోషాయనం చన్న కలదె ఫలము
యోగ దండము బట్టి యోగ దీక్షను బూని
యోగినని కూర్చున్న లేదు ఫలము
రుద్రాక్ష మాలలు రూఢిగా మెడనిండ
పొదిగి నంతనె ముక్తి ఫలము లేదు
పరికించి తనలోని పరమాత్మునిం దెలిసి
పరధ్యానమున్ బారదోలెనేని
గీ. వానికే గల్గు మోక్షంబు వనరుగాను
తానె యిటు దీక్షపరుడైన తపసి యగును
ధన్యతను గాంచి తరియించు తనువు మరచి
పన్నగేంద్రుని గొల్వుడో భక్తులారా!

(అనుచు వీధిని బోవుచు) ఓహో! మరచితిని. నా సోదరికి మరల దర్శన మిచ్చెదనని పల్కి అంపితిని. ఆమె నా కొరకు నిరీక్షించుచుండును. ఆమెను గాంచి ఆమె కోర్కెను నెరవేర్చెదను గాక. (ఎదురు కొంత దూరమున వచ్చుచున్న అన్నపూర్ణను గాంచి) ఆ వచ్చున దెవరు. (పరికించి) నా సోదరియె. నేనే ఆమెను గాంచ పోబోవ ఆమెయే వచ్చుచున్నది. (ప్రకాశముగా) అమ్మా! సోదరీ! నీ మెట్టినింటి వారందరును క్షేమముగ నున్నవారా!

సతతము నీ కే కొరంతయును లేక నీ భర్త నీ కనుకూలుడై యుండి క్షేమము గల్గియుండు వారలా?

అన్నపూర్ణ:- (సంతోషానందముతో) అన్నయ్యా! క్షేమముగానే యున్నవారము. అన్నయ్యా! మరల నీదర్శన మపేక్షించి మన గృహంబునకు వచ్చుచున్న నాపూర్వపుణ్యముచే మార్గమధ్యముననే నీదర్శనము లభించినది. వెళ్లుదమురమ్ము. మన అంతఃపురమునకు!

వేమన:- సోదరీ! అదియే కోరవద్దు. అది గృహస్థాశ్రమ ధర్మము. నీవు నావలన యింకేమైన సత్ఫలితములను గోరదలచిన గోరికొనుము. తప్పక సిద్ధింపజేసెదను.

అన్నపూర్ణ:- అన్నయ్యా! నాకింకేమియు వలదు. నీదర్శనమే చాలును.

వేమన:- సోదరీ! అరుగో భక్తులరుదెంచుచున్నారు. వారలక్షేమము తెలిసికొందము.

(భక్తులు ప్రవేశింతురు. అనుబంధము పాడుచు)

బాబయ్యా! అగ్న్యానంలోబడి బంగారు కాయలు దొంగిలించినందుకు చమించండి సోమి. మీా మాత్తువల్ల మా అగ్యేనము వీడింది. మేమందరము మీా దరిచనంకొరకు వచ్చాము సోమి. మమ్మూలను మీా బత్తులుగా జేచికొని మాకు ముత్తిమారగము చెప్పండి.

వేమన:- అమాయికులారా! గురువుని యెడలను, మాతృదేవతల యెడలను, అపచారములను గాని, అబద్ధములనుగాని ఆడరాదు. అట్టియెడ మీరు నాకొనర్చిన యపకృతిని వెల్లడించి నిజము జెప్పితిరి గాన సర్వదా భగవంతుడు మీకు తోడ్పడగలడు, విచారింపకుడు. మీకు నే నొక్క మంత్రముపదేశించెదను. దానిని యేమరక ధ్యానించినచో యీతిబాధ లడంగి సుఖించెదరు గాక.

భక్తులు:- అదేందో శెప్పండి బాబయ్యా! దండా లెట్టకొంటాం.

**వేమన:**- నాయలరారా ! చెప్పెదను అనండి.

శ్లో. జయతు జయతు మంత్రం, జన్మసాఫల్య మంత్రం సకలనిగమ మంత్రం సర్వశాస్త్రైక మంత్రం, రఘుపతి నిజమంత్రం, రామరామేతి మంత్రం.

(అన్నపూర్ణను గాంచి) అమ్మా ! సోదరీ! యిదియే నా కడసారి దర్శనము. దీర్ఘసుమంగలీ భవ! మీ కోరిక లెవ్వియో కోరుకొనుము. నే నిక తపస్సమాధి కరిగెద.

అన్నపూర్ణ:- మీ దయచే నింతవరకు కృతార్థత నొందితిని. అయిన నిట్లగు గాక !

గీ. వేమన విధాన వేదాంత వేత్త లగుచు
ప్రజలు సంసార జన్య దుర్వ్యథలు లేక
శాంతి సౌఖ్యంబు శుభమును సంతతంబు
చెందుదురు గాక శ్రీహరి స్నిగ్ధ కరుణా.

శ్రీ వల్లుట్ల గోత్రోద్భవ లంకిరెడ్డి సకలారెడ్డి పౌత్రకోటిరెడ్డి పుత్ర
వెంకట సుబ్బారెడ్డిచే శ్రీ ఉమామహేశ్వరస్వామి వార్ల
కృపాకటాక్ష వీక్షణములచే వ్రాయబడిన
శ్రీ వేమన మాహాత్మ్య మను నాటకమునందలి
పంచ మాంకము సమాప్తము.



— మంగళమ్ మహత్ —

శ్రీ శ్రీ శ్రీ

---

భారతీ ప్రెస్, తెనాలి — 1954.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B200 |
| పుస్తకం పేరు | వేమన మాహాత్మ్యము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 83 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 3A |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | theena |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |